

శ్రీ ప్రకాశం పంతులుగారి భౌతికదేహంపై ముఖ్యమంత్రి పుష్పమాల వేస్తున్నారు.



ఆంధ్రప్రదేశ్ కాంగ్రెసు కమిటీ అధ్యక్షులు శ్రీఅల్లూరి సత్యనారాయణరాజుగారు పుష్పమాల వేస్తున్నారు.

# న భూతో న భవిష్యతి

ప్రకాశం పంతులుగారు వెళ్ళిపోయారు. పూర్వానుభవం దృష్టాంతమైతే ఆయన మొన్న మరణించవలసినవారు కారు, ఎన్నో గండాలు గడచిన ఉద్దండ పిండం అది. ప్రజలంతా ప్రకాశంగారు బ్రతికి తీర్తారనుకున్నారు నిపుణులైన వైద్యులు మృత్యుదేవతతో ఆయనకోసం అహో రాత్రులు యుద్ధం చేశారు. పంతులుగారు మాత్రం అస్త్రసన్యాసం చేశారు. ఆంధ్రప్రదేశ రాజధాని, భాగ్యనగరంలో ప్రాణత్యాగం సంకల్పించుకుని, ఆనాటి భీష్మాచార్యునివలె ఆంధ్ర భీష్ములు ఇచ్ఛా మరణప్రాప్తులయినారు. ఒక మహోత్కృష్ట కార్యసాధనకోసం మానవరూపం ధరించిన ఒక దివ్యాత్మ, సంపూర్ణ విజయసాధనానంతరం ఆ కళేబరం విసర్జించి వెళ్ళిపోయింది. నవ్య భారతంలో—

"మనసారథి మన సచివుడు........
మన సఖుండు మన బాంధవుడున్
....మనలను దిగనాడి చనియె . ."

అట్టివాడు వెనుక లేడు, ముందు రాబోడు.

ఒక పత్రికారచయిత దృష్టిలో—

# 'ఆంధ్రకేసరి' ప్రకాశం పంతులుగారు

శ్రీ వి. ఎ. పణిక్కర్

(పత్రికా రచయితలకూ అభిప్రాయా లుంటాయి. లోకంలో అవే చెల్లుతూవుంటాయి. కాని వారు స్వయంగా, ముందుకు వచ్చి ఇవిగో, ఇవి నా అభిప్రాయాలు అని చెప్పరు. అలా చెప్పడం చాలా అరుదు. ఈ వ్యాసంలో శ్రీ ప్రకాశం పంతులుగారితో దాదాపు ఇరవై యేళ్ళ పరిచయంగల పత్రికా విలేఖరి శ్రీ వి. ఏ. పణిక్కర్ మహానాయకుడూ, స్వయంగా పత్రికా రచయితా అయిన పంతులుగారి వ్యక్తిత్వంలోని యదార్థాలను కొన్నిటిని ప్రస్తావించారు.)

ప్రకాశం పంతులుగారివలె పత్రికా రచయితలకు చక్కని తర్ఫీదు ఇచ్చి వారిని ఉన్నతస్థితికి తెచ్చిన రాజకీయ నాయకు లెవరూ కానరారు. వారి దగ్గర శిక్షణ పొందిన పత్రికా రచయితలంతా ఈనాడు దేశంలో ప్రసిద్ధులైన పత్రికా సంపాదకులుగా వున్నారు. పంతులుగారు ప్రారంభించిన "స్వరాజ్య"



ఆంధ్రప్రదేశ్ అవతరణోత్సవ సందర్భంలో శ్రీ యస్. బి. పి. పట్టాభిరామారావు, శ్రీ పి. తిమ్మారెడ్డిగారలు శ్రీ టి. ప్రకాశం పంతులుగారిని ఆహ్వానిస్తున్న దృశ్యం.

# దేశంతో పాటు మీరు కూడా అభ్యుదయం పొందండి!

## మీరు మిగుల్చుకున్న డబ్బును భారత ప్రభుత్వ చిన్న మొత్తముల పొదుపు పథకంలో పెట్టుబడి పెట్టండి!

*భారత దేశం యొక్క*

సామాజికాభివృద్ధి కార్యక్రమమునకు, గొప్పనదీలోయ ప్రాజెక్టులకు, రైలుమార్గములు రోడ్ల అభివృద్ధికి సహాయపడండి!

*మీ డబ్బును ఈ క్రింది గ్యారంటీడ్ సెక్యూరిటీలలో దేనిలోనైనా పెట్టుబడి పెట్టండి!*

| | |
|---|---|
| 12 సంవత్సరముల నేషనల్ సేవింగ్స్ సర్టిఫికెట్లు | మెచ్యూరిటీ పొందినమీదట నూటికి ఏడాదికి 4.16 వంతులు చొప్పున వడ్డీ లభిస్తుంది. రూ. 5 లవి మొదలు రూ. 5,000 ల వాటివరకు ఈ సర్టిఫికెట్లు లభించును. వ్యక్తిగతంగా రూ. 25,000 ల వరకు కొనవచ్చును. |
| 10 సంవత్సరముల ట్రెజరీ సేవింగ్సు డిపాజిట్ సర్టిఫికెట్లు | ప్రతియేటా నూటికి 3½ వంతులు చొప్పున వడ్డీ చెల్లించబడుతుంది. రూ. 100 లవి మొదలు రూ. 25,000 లవి వరకు లభిస్తాయి. వ్యక్తిగతంగా రూ. 25,000 ల వరకు కొనవచ్చును. |
| 10 సంవత్సరముల జాతీయ ప్రణాళిక సర్టిఫికెట్లు | మెచ్యూరిటీ పొందిన మీదట నూటికి ఏడాదికి 4½ వంతుల చొప్పున వడ్డీ చెల్లించబడుతుంది. 5 రూ. లవి. 10 రూ. లవి. 25 రూ. లవి. 50 రూ. లవి. 100 రూ. లవి. 500 రూ. లవి. ఇవ్వబడును. వ్యక్తిగతంగా రూ. 2,500 ల వరకు కొనవచ్చును. |
| పోస్టాఫీసు సేవింగ్సు బ్యాంకు అకౌంట్లు | డిపాజిట్లపై రూ. 10,000 ల వరకు నూటికి 2 వంతుల చొప్పున వడ్డీ చేర్చబడుతుంది. శేషముపై రూ. 15,000 ల వరకు నూటికి 1 వంతు చొప్పున వడ్డీ చేర్చబడుతుంది. |
| 15 సంవత్సరముల అన్యూటీ సర్టిఫికెట్లు | నూటికి ఏడాదికి 3½ వంతుల చక్రవడ్డీతో నెలసరి కిస్తులుగా 15 ఏండ్ల లోపున తిరిగి చెల్లించబడుతాయి. జారీచేయబడు ధరలు; రూ. 3,500, రూ. 7,000, రూ. 14,000 రూ. 28,000 వ్యక్తిగతంగా రూ. 28,000 ల వరకు కొనవచ్చును. |

## *ఆదాయపు పన్ను లేకుండా మీకు మంచి ఆదాయం లభిస్తుంది!*
## *భారతదేశ ఉజ్జ్వల భవిష్యత్తుకొరకై పెట్టుబడి పెట్టండి!*

ఇతర వివరములకు, ఈ పెట్టుబళ్ళకు సంబంధించిన నియమావళికొరకు:

**నేషనల్ సేవింగ్సు కమీషనర్, సిమ్లా చిరునామాకుగాని లేక**

**రీజనల్ ఆఫీసరు, హైదరాబాదు (దక్కన్)**

చిరునామాకు గాని వ్రాయవలెను.



# ఆంధ్రప్రదేశ్

సంపుటి 1 | జూన్, 1957 | సంచిక 8
జ్యేష్ఠము, శాలివాహనశకము - 1879

విషయసూచిక



— చందా —
సాలుసరి రు. 1–8–0 లేక
ఒక రూపాయ 50 నయాపైసాలు
విడిప్రతి 0–2–0 లేక 12 నయాపైసాలు



గాంధీభవనంలో శ్రీ ప్రకాశంగారి భౌతికదేహం



ఆంధ్రకేసరి భౌతికదేహం వెనువెంట ఒక మైలు పొడుగున అసంఖ్యాకప్రజానీకం శ్మశానవాటికకి వెళుతున్న దృశ్యం.

ఆంధ్రప్రదేశ్ సమాచార పౌరసంబంధములశాఖచే ప్రచురింపబడి అజంతా ప్రింటర్సులో ముద్రింపబడినది.



శ్రీ ప్రకాశం పంతులుగారు డా. బి. పట్టాభిసీతారామయ్యగారితో ముచ్చటిస్తున్నారు. ముఖ్యమంత్రి, అడ్వొకేట్ జనరల్ శ్రీయుత డి. నరసరాజు ప్రక్కనే నిలబడియున్నారు.

పత్రిక అక్షరాలా పత్రికా రచయితల శిక్షణకేంద్రం. ఆ పత్రిక పద్నాలుగేండ్ల ప్రజాహిత జీవితంలోనూ స్వతంత్రబుద్ధి, జాతీయ దృక్పథంగల ఎందరో పత్రికా రచయితలు ఉదాత్తమైన శిక్షణ పొంది పత్రికా ప్రపంచంలోకి ప్రవేశించారు.

ఖాసా సుబ్బారావు, కృపానిధి, సర్దార్ కె. యం. పణిక్కర్, యన్. యస్, వరదాచారి మొదలగు ఉద్దండులంతా పత్రికా రచనలో మొదట పంతులు గారి వద్దనే శిక్షణ పొందారు. వారిలో మొదటి ఇద్దరూ ఇంకా పత్రికా సంపాదకత్వమే వృత్తిగా పెట్టుకొని వున్నారు. పణిక్కర్ సమర్థులయిన దౌత్యప్రతినిధిగానూ, వరదాచారి అర్థశాస్త్ర గ్రంథాల సమీక్షకుడుగానూ పార్లమెంటరీ అనుభవం గల వ్యక్తిగానూ ఖ్యాతికెక్కారు. 'స్వరాజ్య' పత్రికలో పనిచేసిన ఇంకా అనేకులు ఈనాడు పత్రికారచన రంగంలో ఉన్నత పదవు లధిష్ఠించి వున్నారు.

తమతమ యోగ్యతలను, తాము గ్రహించడానికి గల అవకాశాలను బట్టి ఒక్కొక్కరు ఒక్కొక్క విధంగా ప్రకాశం పంతులుగారినిగూర్చి అభిప్రాయాలు తెలిపారు.

అయితే ఆయన "ధైర్యసాహసాలు మూర్తీభవించిన మహావ్యక్తి" అని మాత్రం అంతా అంగీకరించారు. దగ్గిరికి వెడితే ఆయన మనస్సు నవనీత సమానమని బోధపడుతుంది. ఆయన్ను ఎరగని వారికీ, ఆయనతో సన్నిహిత పరిచయం లేనివారికీ ఆయనలో వున్న దయాగుణాన్నిచూస్తే ఆశ్చర్యం వేస్తుంది. అంత దయామయుడని అనేక సందర్భాలలో ఆయన రుజువు పరచుకున్నాడు. ఆ విషయం తరువాత మనవి చేస్తాను.



మధురస్మృతి :

*శ్రీ ప్రకాశం పంతులుగారు, శ్రీ నీలం సంజీవరెడ్డిగారు ఇష్టాగోష్ఠి జరుపుతున్న దృశ్యం.*

ప్రకాశంపంతులుగారు నూటికినూరుపాళ్ళు పత్రికా రచయిత. పత్రికా రచయితల ఇబ్బందులు ఆయనకు తెలిసినంతగా మరెవరికి తెలియవేమో ! రాజకీయ మతాలకు చెందిన పత్రికాధిపతులు తాము నియమించుకున్న పత్రికా రచయితలు ఎలా వుండాలి, ఏమి వ్రాయాలి, ఎలా వ్యవహరించాలని ఆశిస్తారో ఆయనకు తెలుసు. తమ ఉద్యోగాలు వుండాలంటే పత్రికా రచయితలు తమ పత్రికాధిపతులు గీచిన గీటు దాట కూడదు. వారు నిర్ణయించిన విధానం ప్రకారం వ్రాయాలి. ఈ విషయంలో పత్రికారచయితల స్థితినిచూచి పంతులుగారు జాలిపడేవారు. వారి సానుభూతి ఎప్పుడూ పత్రికా రచయితల తరఫే. ఏమైనా తప్పులుచేస్తే అవి పరిస్థితుల ప్రభావం ఫలితమే గాని మరొకటి భావించరాదు అంటూ పత్రికా రచయితలను మన్నించి ఆదరించేవారు.

తరచు కొన్ని పత్రికలలో పడ్డవార్తలను ఆ పత్రికల విలేఖరులతో ప్రస్తావిస్తూ అలాకాక మరో విధంగా వ్రాయడం వారికి సాధ్యపడదన్న సంగతి తమకు తెలుసని చెప్పేవారు. ఇష్టమొచ్చినట్టు వ్రాస్తే పత్రికాధిపతులకు ఆగ్రహంరాదూ ? అనుగ్రహంవుంటే ఉద్యోగాలుంటాయిగాని ఆగ్రహం వొస్తే ఊడవూ ! అంతవరకూ తెచ్చుకొనటం సాధ్యమామరి! ఏదో పాపం, తప్పో ఒప్పో—తప్పకంటే ఎక్కువ ఒప్పే. అధిపతులు పాడమన్న పాట పాడుతారు. మరి వీరు తింటున్నది వారిచ్చే జీతాలేగా !

ఇవన్నీ తెలుసు గనుకనే పంతులుగారి సానుభూతి ఎప్పుడూ పత్రికారచయితలమీదనే. ఈ నాడుకొందరు పత్రికాధిపతుల కున్నట్టి దౌర్బల్యాలు పంతులుగారికి లేవు.

ప్రకాశం పంతులుగారు పత్రికలవాళ్ళను అంతగా దగ్గరికి రానివ్వరని కొందరనుకుంటారు. కాని అది యదార్థంకాదు, పత్రికలవాళ్ళను ఆయన ఎప్పుడూ తప్పించుకు పొయ్యేవారుకారు. అంతేకాదు, వాస్తవాలను మరుస్తూ అబద్ధాలను ప్రచారం చేస్తున్నవని తాము భావించే పత్రికలప్రతినిధులనుకూడా ఆయన సహించి మన్నించేవారు. అలాంటి పత్రికలు ఏమి వ్రాసినా అసలు పట్టించుకొనేవారుకారు. ఎందుకూ అంటే అలా వ్రాయడంలో ఆపత్రికల ఉద్దేశమేమిటో ఆయనకు బాగా తెలుసు. అందుచేతనే మిన్నక వుండేవారు.

ప్రకాశం పంతులుగారు వాత్సల్యంతో ఆదరించిన పత్రికా రచయితలలో నేనూ ఒకణ్ణి. నిజంగా అది నాకు పెద్ద గౌరవమని భావిస్తాను. 1935 ఆ ప్రాంతంలో ఆ మహావ్యక్తిని నేను మొదటిపర్యాయం కలుసుకున్నాను. అప్పుడు నేను శ్రీ యం. కె రెడ్డిగారు నడిపే వారపత్రికలో పనిచేస్తూ వుండే వాణ్ణి. పంతులుగారిని నేను కలుసుకోవడానికి రెడ్డిగారే కారకులు. అది మొదలు పంతులుగారు పితృవాత్సల్యంతో నన్ను ఆదరిస్తూ వుండేవారు. "సింహాళ"కు కూడా అపారమైన దయా వాత్సల్యాలు వుంటాయన్న సంగతి అప్పుడు నాకు తెలిసి వచ్చింది.

నాకు ప్రియతమమైనట్టి స్మృతులను, ఘట్టాలను పేర్కొని ఈ వ్యాసాన్ని మరీ విస్తరింప జేయడం నా అభిమతంకాదు. అయితే పంతులుగారు "అచ్చ



*ఆంధ్రప్రదేశ్ అవతరణోత్సవ దినంనాడు ముఖ్యమంత్రి తమ భవనంలో ఏర్పాటుచేసిన విందులో శ్రీ టంగుటూరి ప్రకాశంపంతులుగారు పాల్గొన్న దృశ్యం.*

మైన పత్రికా రచయిత" అనీ పత్రికా రచయితలపట్ల వారికిగల ఆదరాభిమానాలు అద్వితీయమైనవనీ చెప్పడానికి కొన్ని విశేషాలను మనవి చేస్తాను.

పత్రికా రచయితల వృత్తి తేలికైనదికాదు. ఎన్నో కష్ట నష్టాలతో కూడుకొని వున్నది. ఆ విషయం పంతులు గారికి బాగా తెలుసు అన్న విషయం ఈ సంఘటన వల్ల విదితమవుతుంది. ఆయన ముఖ్యమంత్రిగావున్న ఆంధ్రరాష్ట్ర మంత్రివర్గం 1954 నవంబరులో ఓడి పోయింది. అలా జరిగిన కొన్ని క్షణాలకే ఆయన శాసనసభా భవనంనుంచి వెళ్ళిపోతున్నారు. నేను ఆయనవెంట వెడుతున్నాను. ఆయన వెనక్కి తిరిగి "ఏమిటి?" అని నన్ను ప్రశ్నించారు. నేను బదులు చెప్పలేదు. కాని ఆయనే "మంత్రివర్గం ఓడిపోవ డాన్ని గూర్చి నా అభిప్రాయం ఏమిటో తెలుసు కోవాలని వుందిగదూ! మంత్రివర్గం ఓడిపోవడం చాలా మంచిదే అయింది. ఇక మేము ఓటర్లవద్దకు వెళ్ళి వారి తీర్పుపొంది తగు మెజారిటీతో మళ్ళీ తిరిగివస్తాం" అని ఉద్వేగంతో అన్నారు.

ప్రకాశం పంతులుగారు దుడుకుగా వ్యవహరిస్తా రని ప్రతీతి. ఎదురుగుండా ప్రమాదం వున్నగంటే ఆయన మరీ దుడుకుగా వ్యవహరించేవారు. ఒక పర్యాయం ఆయన కారులో పర్యటనకు బైలు దేరారు. కొందరు పత్రికా విలేఖరులంకూడా ఆయన వెంట ఉన్నాం. ఆరోజు కుంభవృష్టి కురిసింది. ఒక వంతెనమీదుగా నీరు ప్రవహిస్తూంది. ఆవంతెనను మేం దాటాలి. అలా దాటడం ఎంత ప్రమాదమో ఆలోచించకుండానే పంతులుగారు డ్రైవరుతో "పోనివ్వు" అన్నారు. వంతెన దాటిన తరువాత ఆయన అన్నారు. "నా ప్రాణాన్నంటే తెగించాను. కాని మిమ్మల్నికూడా అలా చేయడం సమంజసం కాదు"

పంతులుగారు శరీరదార్ఢ్యం కలవారు. ఎంత దూరం కారులో ప్రయాణంచేసినా తట్టుకొనేవారు. కాని అందరూ అలా తట్టుకోగలరా? ఆవిషయం ఆయన గుర్తించ గలిగేవారు. తనవెంట వస్తున్న వారి కందరికీ భోజనవసతి విశ్రాంతి సదుపాయా లున్నవా లేవా శ్రద్ధగా విచారించి ఎవరికీ ఎటువంటి ఇబ్బంది లేకుండా చూస్తూ వుండేవారు.

1946 ఎన్నికలకు ముందు పంతులుగారు ఆంధ్రదేశ మంతటా పర్యటించారు. వారి రాయల సీమ పర్యటనలో పత్రికా విలేఖరులం కొందరం వున్నాం. అయితే నిర్ణీత కార్యక్రమం ప్రకారం ఆయన పొయ్యేవారు. ఎంత స్పీడైనా సరే, దారిలో జనం కన్పిస్తే అక్కడ కొంతసేపాగి వారితో మాట్లాడేవారు. జనం హెచ్చుగుందా, కొద్దిగుందా అన్న ప్రసక్తిలేదు. అర్థరాత్రి అయినప్పటికీ ప్రజలు ఆయన దర్శనంకోసం విసుగులేకుండా కాచుకొని వుండేవారు. ఒక సందర్భం నాకు ఇప్పటికీ బాగా జ్ఞాపకం. ఒకరోజు సాయంత్రం ఆరుగంటలకు ఒక పట్టణంలో పంతులుగారు ఉపన్యసించవలసి వున్నది. కాని ఆ పట్టణం ఇంకా 12 మైళ్ళదూరం వుందనగా దారిలో కారు టైర్ పగిలిపోయింది. మరొక టైర్ కోసం ఒక మనిషిని పట్టణానికి పంపారు. అప్పటికీ కాలాతీతమైంది. పంతులుగారు ఆ పట్టణంచేరుకొనే సరికి అర్థరాత్రి అయింది. కాని ఆశ్చర్యకరమైన విషయమేమంటే బహిరంగసభ జరిగే బస్సుస్టాండులో జనం అప్పటివరకూ నిరీక్షిస్తూ వున్నారు. ఒక్కరూ విసుగుకున్నట్లు కన్పించదు. ప్రజలలో ఆయన కున్న పలుకుబడి అటువంటిది. మరీ గ్రామస్థులు ఆయనపట్ల చూపే ప్రేమాభిమానాలు అద్వితీయ మైనవి.

నేను మరచిపోదామన్నా మరుపురాని సంఘ టన 1949 లో జరిగింది. ప్రకాశం పంతులుగారు అప్పుడు పదవిలో లేరు. మద్రాసులో గవర్నమెంట్ హౌస్ ఎస్టేటులో వారి బస. నేనుకూడా అప్పుడు అక్కడే వుంటున్నాను. పంతులుగారి కార్యదర్శి శ్రీ కొండపి అప్పుడు "లా"చదువుతున్నారు. అందు చేత పగలు నాపనిఅయిపోయినతరువాత యథాశక్తి సేవచేద్దామని రాత్రులు పంతులుగారింటికి వెళ్ళే వాణ్ణి. ఆ రోజులలో నేను ఉబ్బసంవ్యాధితో బాధ పడుతూండేవాణ్ణి. ఒకరాత్రి నాబాధ మరీ ఎక్కు వైంది. పంతులుగారు చూడలేక పొయ్యారు. నా బాధను తగ్గించడానికి ఏమిచేయడానికైనా తాము సంసిద్ధమే అన్నారు. మరుసటిరోజు తమ స్నేహితుణ్ణి ఇచ్చి నన్ను రాయపురం ఆసుపత్రిలో చేర్పించారు. సాధారణంగా ఆ ఆసుపత్రిలో ఉబ్బసపు రోగులను చేర్చుకోరు. అయినా నాకు ప్రవేశం లభించింది.

ఆ మహానుభావుడు నాపై చూపిన వాత్సల్యానికి అనుగుణంగా నడచుకోడానికి నేను ఎల్లప్పుడూ ప్రయత్నిస్తూ వొచ్చాను. దయామయుడైన ఆ మహాపురుషుని అంతిమ ఘడియలలో ఆయనవద్ద వుండగల్గడమే నాకు పెద్ద సంతృప్తిగా వుంది. నా పనులు చూచుకుంటూనే తరచు ఆసుపత్రికి వెళ్ళి ఆయనను చూచి వస్తూ వుండేవాణ్ణి. అయితే అంతటితోనే తృప్తి చెంది వుండలేక ఏదో కోల్పోయిన వాడిలా అనుభూతి చెందుతున్నాను.

ఒక దివ్యాత్మ ఈ ప్రపంచాన్ని విడిచి వెళ్ళింది. ఆ ఆత్మకు శాంతికలుగుగాక!

* * * *



*గాంధీ భవనములో ప్రకాశంగారి కుటుంబం దుఃఖసాగరంలో మునిగియున్నారు*



అమాత్యుల సతీమణులు శ్రద్ధాంజలి సమర్పిస్తున్న దృశ్యం.



శ్రీ టి. ప్రకాశంగారి భౌతికదేహంపై శ్రీ వి. వి. రాజు పుష్పమాల వేస్తున్న దృశ్యం.



ప్రియతమ నాయకునికి శ్రద్ధాంజలి సమర్పించుటకు గాంధీ భవనానికి అసంఖ్యాక ప్రజలు వచ్చారు



గోల్కొండ పత్రికా సంపాదకులు శ్రీ యన్. నరోత్తమరెడ్డిగారు ఆంధ్ర కేసరికి శ్రద్ధాంజలి సమర్పిస్తున్న దృశ్యం.



అంతిమ యాత్ర.



శ్రీ ప్రకాశం ప్రజానాయకులు. దుఃఖాక్రాంతులైన అసంఖ్యాక ప్రజలు భౌతికదేహం వెనువెంట నడుస్తున్నారు.



శ్రీ ప్రకాశం పంతులుగారి ద్వితీయ పుత్రుడు శ్రీ హనుమంతరావుగారు అంత్యక్రియలు జరుపుతున్నారు.



శ్రీ ప్రకాశం పంతులుగారి భౌతికదేహానికి నిప్పు అంటించేముందు
రక్షక భటులు మువ్వూరు తుపాకులు ప్రేల్చి ఆఖరుసారి వందనం సమర్పిస్తున్న దృశ్యం.



పద్మభూషణ శ్రీ మాడపాటి హనుమంతరావుగారు శ్రీ ప్రకాశం పంతులుగారి సేవానిరతిని, త్యాగశీలమును కొనియాడుతూ మాట్లాడుతూన్న దృశ్యం.



అంత్యక్రియల సందర్భంలో ప్రధాన కార్యదర్శి శ్రీ యం. వి. పాయ్‌గారు ఆంధ్ర ప్రదేశ్ గవర్నరు పంపిన సందేశాన్ని చదువుతున్నారు.



*1957* మే *29* తేదీన పద్మభూషణ శ్రీ మాడపాటి హనుమంతరావుగారు హైద్రాబాదు సమీపంలో ఈసా, మూసీనదుల సంగమస్థానంలో శ్రీ ప్రకాశంగారి అస్థికలను నిమజ్జనంచేస్తున్నారు.



శ్రీ ప్రకాశంగారి అస్థికలు రాజమంద్రి స్టేషనునుంచి గోదావరిలో నిమజ్జనం చేయుటకు తీసుకొని పోబడుతున్న దృశ్యం.



విజయవాడ స్టేషనులో శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావుగారు శ్రీ ప్రకాశంగారి అస్థికల నిక్షేపాన్ని స్వీకరిస్తున్నారు



శ్రీ తెన్నేటి విశ్వనాధంగారు శ్రీ ప్రకాశంగారి అస్థికల నిక్షేపాన్ని
విశాఖపట్నం టౌన్ హాలునుంచి తీసుకొని బయలుదేరుతున్న దృశ్యం.

సమీక్ష:

# ఆంధ్రప్రదేశ్ అభివృద్ధి కార్యక్రమాల విద్వద్గోష్ఠి

శ్రీ జె. టి. ఫెర్నాండెజ్

ఆంధ్రప్రదేశ్ సమాజాభివృద్ధి కార్యక్రమాలపై బిషప్ చిత్తంబరం మెమోరియల్ హాలులో ఇటీవల జరిగిన విద్వద్గోష్ఠి ఇంతకుముందు హైదరాబాదులో జరిగిన అధికార సమావేశాలకంటే భిన్నమైనది. ఎన్నో సంవత్సరాలుగా అటువంటివాటి నెన్నిటినో నేను చూసివున్నందున ఆ విషయం నాకు బాగా తెలుసు. విశాలోన్నతములైన హాలుల దర్పోద్ధతులు కాని బంగారు జరీ బుటావు వేసిన పట్టు కుర్చీలు కాని యీనాడు లేవు. సుందరమైన చైనా కప్పులతో యిచ్చే తేనీరూ లేదు. వయసుమీరిన అధ్యక్షుని చప్పిడి ప్రసంగాలు, తమ పనిని తామే పొగడుకొనే వుద్యోగుల విసుగెత్తించే ప్రసంగాలు కూడా యీనాడు లేవు. యీనాడు వున్నవన్నీ అందుకు భిన్నమైనవి. గోష్ఠి పరిసరాలు నిరాడంబరంగా వున్నాయి. కార్యక్రమ నిర్వహణలో వ్యవహార దృష్టి గోచరించింది. గోష్ఠికి వచ్చిన వారిలో యెక్కువమంది వుద్యోగులే అయినా వారు ఏకాగ్రతతో తమ పనిని చేసుకుపోతున్నారు. నిరాడంబరులైన ముఖ్యమంత్రి "సమస్యల గురించి తెలుసుకొనడానికై" శ్రమ అనుకోకుండా గంటలకొద్దీ జరిగే చర్చల్ని వింటూ కూడా, అవసరమైనప్పుడల్లా సహాయ ప్రోత్సాహాన్ని కలిగించడానికి సంసిద్ధులై కూర్చొనివుండేవారు. మంత్రులుకూడా చర్చల్ని శ్రద్ధగావింటూ అవసరమైనప్పుడల్లా వాటిలో పాల్గొనేవారు. అధ్యక్షులైన ప్లానింగు శాఖా మంత్రి శ్రద్ధాళువై చర్చల్ని జరిపిస్తూ, అన్యవిషయాలపైకి దృష్టిమళ్ళకుండా నివారించేవారు. చక్కని విషయ పరిజ్ఞానం గల సమర్థులైన కార్యదర్శి విమర్శలకు జవాబు చెపుతూ, సందేహాలను నివృత్తి చేస్తూ చర్చలకు తోడ్పడేవారు. ఇవన్నీ యీ చర్చలకు వాస్తవికత, ప్రాధాన్యత, వుత్సుకతలను సమకూర్చి యీ విద్వద్గోష్ఠికి ఒక ప్రత్యేకత నిచ్చాయి.

గోష్ఠిలో కన్పించిన వుత్సాహం ప్రశంసనీయంగావుంది. అంత ఆసక్తితో మూడురోజులు కూచుని అటువంటి కార్యక్రమాన్ని సమగ్రంగా యింతకుముందు నేనెన్నడూ చూడలేదు. ఈ కారణం వల్లనే అప్పుడు నాకు కలిగిన భావాలను "ఆంధ్రప్రదేశ్" పాఠకులకు అందించాలనే అభిలాష కలిగింది. ఈ సభ వుద్యోగులలోను, పల్లె ప్రజలలోను కలుగుతూవున్న నవ చైతన్యానికి ప్రమాణం. ఈ చైతన్యం వల్ల పల్లె ప్రాంతాల పరిస్థితులు మారుతున్నాయి. ఆంధ్రప్రదేశ్ ప్రజలు, ముఖ్యంగా గ్రామాదులు సంక్షేమ సౌభాగ్యాల ప్రాంగణంలోకి చేరుకున్నారు. ఈ సంక్షేమాన్ని సాధిస్తున్నవారు విద్వద్గోష్ఠిలో ముసాయిదా కార్యక్రమాన్ని గురించి చర్చించారు. వారిలో వివిధ తరగతుల ప్రభుత్వోద్యోగులే కాక పెక్కుమంది అనధికారులుకూడా వున్నారు. సమాజాభివృద్ధికి ముఖ్యాధారం ప్రజాసహకారమే కదా.

## ప్రారంభ సమావేశం

ముఖ్యమంత్రి శ్రీ నీలం సంజీవరెడ్డిగారు ఆరంభంలోనే యీ చర్చా గోష్ఠికి వుత్సాహాన్ని కలిగించారు. "ప్రజా సహకారంతో సమాజాభివృద్ధి" అనే సార్వజనీన ప్రయోజనానికై పాటుపడుతూ ఆలోచనలను, అనుభవాలను పరస్పరం తెలుసుకోడానికై ఆంధ్రప్రదేశ్ 20 జిల్లాలనుంచి వచ్చిన దాదాపు 500 మంది వుద్యోగులు, అనధికార ప్రముఖులు. "సభకు శోభనుచేకూర్చిన స్త్రీలను" అభినందిస్తూ "ఈనాడు మనకు యెక్కువ వివేకము, అనుభవము వున్నప్పటికీ," అభివృద్ధి కార్యక్రమం క్రిందవున్న 450 బ్లాకులలోను చెప్పుకోతగిన అభివృద్ధిని కొంత సాధించినప్పటికీ యింకా రాష్ట్రంలో మూడింట రెండువంతులకు మించిన ప్రాంతంలో ఎంతోపని జరుగవలసి వున్నది అని ఆయన అన్నారు. "ఆహారోత్పత్తిరీత్యా ఆంధ్ర మిగులు ప్రదేశము. ఎక్కువ భూములను సాగుక్రిందికి తీసుకు వచ్చాము కూడా. అయినప్పటికీ యీనాడు యిక్కడ ధరలు పెరుగుతున్నాయంటే వుత్పత్తి తగినంత లేదన్నమాట.



*ముఖ్యమంత్రిగారు సెమినార్‌ను విచ్చేసిన సందర్భములో వారికి ప్లానింగు, డెవలప్‌మెంటు కార్యదర్శి శ్రీ సి. నరసింహ్మం బ్యాడ్జ్ గుచ్చుతున్నారు.*

దానిని హెచ్చించాలి. ఆ పనిని సత్వరం చేయాలి. అంకె లనుబట్టి చూస్తే మనం బాగానే పనిచేశా మనిపించవచ్చు. భారతదేశంలో సమాజాభివృద్ధిలో ఆంధ్రప్రదేశ్ అగ్ర స్థానంలో వుందని ప్రచారంవల్ల పేరు సంపాదించవచ్చు. కాని మన అభివృద్ధికి కొలబద్ద మనం సాధించిన ఫలితాలే కాని ప్రచారం కాదు. ధరలను తగ్గించడానికి అవసరమైనంతగా వుత్పత్తిని హెచ్చించనంత కాలము మనం చేయవలసినంత చేయలేదన్నమాట" అని ఆయన అన్నారు. కల్లాకపటం లేకుండావున్న విషయాన్ని చెప్పివేసినందుకు సదస్యులు తలలూపారు. గోష్ఠికి జీవం వచ్చింది.

కాని ముఖ్యమంత్రి అక్కడితో ఆగలేదు. భారతదేశంలో మరొక ప్రాంతంలోనో లేక ఆంధ్రలోనో చేపట్టబడిన పెద్ద పెద్ద ప్రాజెక్టుల ఘనతను తలచుకుని తృప్తిపడి వూరుకోవద్దని ఆయన ప్రేక్షకులను హెచ్చరించారు. "అటువంటి ప్రాజెక్టులకి ఉండేవిలువ ఉండనే వున్నది. వాటికి ముందు ప్రాధాన్యత యివ్వబడిన మాటా నిజమే. అయితే ఇప్పుడు గ్రామాన్ని, గ్రామీణుని సమీపించవలసిన సమయంవచ్చింది. "ప్రతి గ్రామానికి ఒక పథకము", "ప్రతికుటుంబానికి ఒక పథకము" కావాలి. ప్రతి కుటుంబానికి ఒక పథకం అన్న ఆలోచనను అథమపక్షం ఒక్క బ్లాకుల్లోనైనా ఆచరణలో పెట్టి చూడాలి. గ్రామీణునికి వుత్సాహం కలిగించి అతడు పూర్తిగా యీ కార్యక్రమంలో పాల్గొనేట్టు చేయడమే ఈ పథకం ఉద్దేశం. దీన్ని సాధించాలంటే వుద్యోగులు తాము ప్రజల కోసం పనిచేస్తున్నామనే విషయం సర్వదా జ్ఞాపకం వుంచుకోవాలి. ప్రజాసామాన్యంతో యెక్కువ సన్నిహితంగా వుండాలి. అధికార. అనధికారుల మధ్య వున్న అంతరం యింకా అలాగేవుంది. దానిని తగ్గించాలి. ఉద్యోగులు తాము అధికులమనే భావాన్ని వదిలి ప్రజలకు బాగా సన్నిహితులు కావాలి. అంటే మామూలు మాటలలో చెప్పాలంటే వున్నతంగా ఆలోచించాలి. ఇది మానవ వ్యవస్థ" అని ముఖ్యమంత్రి ప్రబోధించారు.

ప్రజలు పాల్గొనే యీ కార్యక్రమాన్ని గూర్చి నలుగురికీ తెలియచేయడానికే సమాజాభివృద్ధిపై యీ విద్వద్గోష్ఠి యేర్పాటు చేయబడింది. లేదా శ్రీ వి. బి. రాజుగారు చెప్పినట్టు "మన పథకాల ఆశయాలను సాధించడానికై క్రొత్త వుత్సాహాన్ని పొందడం కోసం." అన్నా ఒకటే. "మానవ వ్యవస్థ అభివృద్ధి", ఆ విషయంలో గ్రామకార్యకర్త వహించే పాత్రకూడా ముఖ్యమైనదని శ్రీ రాజుగారుకూడా చెప్పారు. మొత్తంమీద ఆంధ్రప్రదేశ్ సాధించిన ఫలితాలు

ముఖ్యంగా వ్యవసాయం, పశుసంపదల విషయంలో ప్రశంసార్హంగా వున్నాయని అంగీకరిస్తూ సమాజాభివృద్ధి కార్యకర్తలు తృప్తిచెందరాదన్నారు. ఆయన చెప్పిన ఒక్క విషయాన్ని ప్రత్యేకంగా పేర్కొనాలి. ప్లానింగుశాఖ అంటే ప్రభుత్వం కాదని ఆయన నొక్కి చెప్పారు. అది యితర అభివృద్ధిశాఖలకంటె భిన్న కాదు. కాకపోతే అది ఇతరశాఖల కృషిని సమన్వయం చేసి, ఒక మార్గంలో నడిపిస్తుంది.

ఈ చర్చలు వింటున్నంతసేపూ కలిగిన మనోభావాలను యీ సందర్భంలో యిక్కడ చెబుతాను. శ్రేయోరాజ్యం అనే క్రొత్తభావం ఇప్పుడు ఏర్పడుతున్నది. ప్రస్తుతపు పరిపాలనావ్యవస్థ మంచికొరకు మార్పుచెందే సమయం ఆసన్నమైనదనేదే ఆ భావం. పాతవ్యవస్థ శీఘ్రంగా మారిపోతున్నది. కొత్తగా పరిపాలనా వ్యవహారాలను చూసే వారికి యీ మార్పును గురించి తెలుసు. నిజంగా యిది హర్షించదగిన విశేషం. అధికారంగా ప్రచురితమైన ఒక చిన్న పుస్తకంలోని మొదటి పేరాలో యీ విషయం స్పష్టపడుతుంది. దానిలో యిలావుంది: మన గ్రామాలను ఆర్థికంగా, సాంఘికంగా పునరుద్ధరించేందుకు సమాజవృద్ధి కొత్తమార్గం. గ్రామీణ భారతదేశంలోని వస్తుసంపదను మానవ సంపదను పూర్తిగా అభివృద్ధిపరచడమే దాని ఆశయం. గ్రామీణజీవితానికి సంబంధించిన అన్నిదశలు-గ్రామీణుల నైతిక, సాంస్కృతిక, ఆర్థికజీవితం యావత్తూ దీనిక్రిందికి వస్తుంది. ఈ కార్యక్రమాన్ని అమలు జరపడానికి కావలసిన వుపకరణాన్ని గురించి దానిలో యిలా వుంది. "బాగా వికేంద్రీకృతమైన పరిపాలనావ్యవస్థ కొంతవరకూ స్వయం పరిపాలితములైన పెక్కు స్థానికయూనిట్ల ద్వారా పనిచేయడం, కలిసి మెలిసి పనిచేయాలనే మహోన్నతమైన భావం వుండడం చాలా అవసరం."

సమాజాభివృద్ధి పనులకు కొంత నిర్బంధాన్ని ప్రవేశపెట్టవచ్చునా అని శ్రీ రాజుగారు ప్రశ్నించారు. కాని దానికి జవాబు రాలేదు. ముఖ్యమంత్రి అంతకంటేమంచి సూచన ఒకటి చేశారు. వచ్చే పది సంవత్సరాలలోను మనం బాగా వేగంగా పని చేసి, యితర దేశాలతో సమఉజ్జీగా "మన ప్రయత్నాలు యింకా శక్తివంతాలుగా వుండాలి. ప్రజలను మనం సరైన పంథాలో సమీపిస్తే వారు ఘనతో సహకరిస్తారు," అని ఆయన అన్నారు.

సహకారశాఖామంత్రి నవాబ్ మెహదీనవాజ్‌జంగ్‌కూడా ప్రారంభోత్సవ సందర్భంలో మాట్లాడుతూ మానవులతో సత్సంబంధాలను కలిగించుకోడం నేర్చుకోవాలని నొక్కి



*ముఖ్యమంత్రిగారు 1957 మే, 16 వ తేదీన హైద్రాబాదులో ప్రథమ అంతర్-రాష్ట్ర ప్లానింగు సెమినార్‌కు ప్రారంభోత్సవము చేస్తున్న దృశ్యం.*



అంతర్-రాష్ట్ర సెమినార్‌లో కేంద్ర కమ్యూనిటీ డెవలప్‌మెంటు మంత్రి శ్రీ యస్. కె. డే. ఉపన్యసిస్తున్న దృశ్యం.

చెప్పారు. "మానవజీవితాన్ని సర్వతోముఖంగా అభివృద్ధి చేసే ప్రయత్నంలో అద్భుతమైన పనులు చేస్తూనే యెవరి కోసం వారు పాటుపడుతున్నారో వాటికి మీయందు ప్రేమ వున్నదా అన్న విషయాన్ని తెలుసుకోండి." అని ఆయన సలహా చెప్పారు. సహకార కామన్వెల్తు సాధనకై కృషి చేయాలని చెబుతూ, "సహకారం ప్రస్తుతం కేవలం ఆదర్శంగా కనబడుతుంది. కాని యీ విద్వద్గోష్ఠిలో సహకారోద్యమం విస్తరణకి సంబంధించిన సమస్యల గురించి చర్చించడానికి చాలాకాలం వినియోగించడాన్ని బట్టి ముందు ముందు సమాజాభివృద్ధిలో సహకార సంస్థలు యెక్కువ చురుగ్గా పనిచేస్తాయని రుజువయింది." అని ఆయన అన్నారు. సహకారం వెనుకనున్న ఆదర్శాన్ని యింకా రైతుకి బోధించవలసివుందన్నారు. "ఎక్కువ ప్రచారం కాక యెక్కువ ప్రజాసేవ జరగాలి" అని ఆయన హెచ్చరించారు

## విడి చర్చలు

విద్వద్గోష్ఠి మొదటిరోజు వుదయం ప్రారంభ సమావేశానంతరం సభికులు వివిధ విషయాలను విడిగా పరిశీలించడానికి ఆరు వర్గాలు (గ్రూపులు) గా విడిపోయారు. ఒక్కొక్క వర్గంలో యించుమించు 50 మంది వున్నారు. ప్రతి వర్గానికీ ఒక సీనియర్ సివిల్‌సర్వీసు ఆఫీసరు నాయకుడు. ప్లానింగుశాఖ కమీషనరు, అదనపు కార్యదర్శి అయిన శ్రీ సి. నరసింహం విపులమైన కార్యక్రమాన్ని అందు కవసరమైన విషయ వివరణతోసహా తయారు చేశారు. ప్లానింగు వ్యవహారాలలో తనకున్న దీర్ఘ పరిశీలనానుభవాలతో ఆయన చర్చలకు చక్కని నిర్దుష్టమైన పద్ధతుల్ని రూపొందించారు. ఆయన సమకూర్చిన విషయ వివరణవల్ల సభ్యులదృష్టి విషయాంతరాలపైకి మళ్ళలేదు, దృఢమైన నాయకత్వంవల్ల కాలం కలసివచ్చింది. మంత్రి శ్రీ వి. బి. రాజు. శ్రీ నరసింహం ప్రతి వర్గంతోను చాలసేపు గడపి సమాచారాన్ని తెలుసుకున్నారు చర్చలకు తోడ్పడ్డారు కూడా. ఆచరణకి సంబంధించిన వివరాలలో యీ చర్చలు చాలా ప్రబోధాత్మకంగా వున్నాయట. ప్రతి వర్గంలోను రెవిన్యూబోర్డు సభ్యులు, జాతినిర్మాణ సంక్షేమ శాఖల కార్యదర్శులు, అధిపతులు, డిప్యూటీ కార్యదర్శులు, 20 జిల్లాలనుంచి వచ్చిన కలక్టర్లు, ప్లానింగు ఆఫీసర్లు, ప్రాజెక్టు యెగ్జిక్యూటివ్ ఆఫీసర్లందరూ, బ్లాకు అభివృద్ధి



*అంతర్-రాష్ట్ర సెమినార్‌లో ప్లానింగు మంత్రి శ్రీ వి. బి. రాజు ప్రసంగిస్తున్న దృశ్యం.*

ఆఫీసర్లు, సాంఘికవిద్యా ఆఫీసర్లు, (వారిలో చాలమంది స్త్రీలు) గ్రామ కార్యకర్తలు, పెక్కుమంది అనధికారులు వున్నారు. ఆశ్చర్య మేమిటంటే, చర్చలు సాయంకాలం కాకుండానే పూర్తయి పోయాయి. మరునాడు వుదయం గోష్ఠి బహిరంగ సమావేశంలో చర్చించడానికి గ్రూపు చర్చల నివేదిక 40 పేజీలది సిద్ధంగావుంది. నిజంగా యిది మెచ్చుకొన దగిన విషయం.

## బహిరంగ చర్చలు

గోష్ఠి రెండవరోజున పత్రికా విలేఖరులకు ఒక నూతనానుభవం కలిగింది. అధికార సమావేశాలలో వ్యవహారాలను గురించిన చర్చలలో సామాన్యంగా విలేఖరులకు ప్రవేశముండదు. తమ వ్యవహారాలలోని లోపాలను బహిరంగంగా చర్చించి సరిదిద్దుకొనడానికి వుద్యోగులు యిష్టపడలేదు. పత్రికా విలేఖరికి తెలిసిన విషయాలు సర్వవ్యాప్తమైపోతాయి. కాబట్టి సహజంగా వారు తమలోపాల్ని అనంగీకారాన్ని విలేఖరి తెలుసుకొనడానికి యిష్టపడరు. అధికార సమావేశాలు సామాన్యంగా యే విషయమూ పైకి రాకుండా హడావిడిగా జరిగిపోతూంటాయి. అందుచేత యీ విద్వద్గోష్ఠిలో చర్చలకు హాజరుకావడం ఆనందదాయకమైన మార్పుగా వుంది. చర్చలలో అభిప్రాయాలు వున్నవి వున్నట్టు స్వేచ్ఛగా వ్యక్తంచేయబడ్డాయి. చాలా విమర్శ కూడా జరిగింది. అయితే అందువల్ల యెవరి గౌరవమూ తగ్గలేదు. అది ప్రజాస్వామిక యుగానికి తగినట్టు వుంది. పత్రికా విలేఖరులు తమకు కలిగించబడిన యీ సౌకర్యాన్ని ఎంతో గౌరవించారు.

ప్రజారాజ్యంలో ప్రజలకు సహకారం కావాలన్నప్పుడు యేమి జరుగుతున్నదో ప్రజలు తెలుసుకొనడం అవసరం. మంత్రులు అజాగ్రత్తగా మాట్లాడిన రోజులున్నాయి. ముఖ్యమంత్రి "హృదయం విప్పి మాట్లాడుతూ" తాను చెప్పిన వాటిని యథాతథంగా వ్రాసుకోవద్దని చెప్పారు. పత్రికా విలేఖరులు ఆయన చెప్పినదానినంతను ప్రచురించడానికి వీలుపడలేదు. కాని ముఖ్యమంత్రి చెప్పినదానిలో ప్రచురించకూడని దేదీలేదు. ఆయన హృదయపూర్వకంగా దాపరికం లేకుండా చెప్పిన మాటల్ని ప్రేక్షకులు చాలా శ్రద్ధగా విన్నారు. వాస్తవానికి విషయం బహుళ ప్రచార యోగ్యమైనది. రుచించని మాటలనైనా సరే అనడానికి శ్రీ సంజీవరెడ్డి వెనుదీయరు. అందుకాయన్ని మరింత

గౌరవించవలసివుంది. ప్రజలపట్ల తమ దృక్పథాన్ని, నడతను మార్చుకొనమని ఆయన కలక్టర్లకి, అధికారులకి సలహా యిచ్చారు. వారు ప్రజలకు యింకా సులభముగా వుండాలని, కాలానికి, అధికార మర్యాదలకి అంటిపెట్టుకుని వుండవద్దని కూడా వారికి సలహా చెప్పారు. అవినీతికి దూరంగా వుండమనీ, వ్యయభరితములైన మర్యాదలను స్వీకరించవద్దనీ హెచ్చరించారు. ఆయన అన్న ముఖ్యమైన మాటలు కొన్ని నాకు జ్ఞాపకం లేనందున వాటిని వ్రాయలేకపోతున్నాను. కాని "మీరేమి చేసినా, భగవంతునికి జవాబు చెప్పవలసివుంటుంది అని జ్ఞాపకం వుంచుకొనండి" అని ఆయన ప్రేక్షకులకి జ్ఞాపకంచేసినప్పుడు సర్వత్రా హర్షామోదాలు వెల్లివిరిశాయి. నిష్కపటమైన నిజాయితీ గల అట్టి నాయకత్వం కలిగివుండడం మన రాష్ట్ర భవిష్యత్తుకు శుభకరం.

## చర్చకు వచ్చిన కొన్ని విషయాలు

చాలా విషయాలు చర్చకు వచ్చాయి. వాటిని కాని యితర విషయాల సమగ్ర స్వభావాన్ని క్లుప్తంగానైనా యిక్కడ చెప్పడం సాధ్యం కాదు. చర్చలకున్న అవకాశాలను తెలియజేయడానికై కొన్నిటిని చెబుతాను. ఒక గ్రూపు వ్యవసాయ వస్తూత్పత్తిని హెచ్చించడానికి గల మార్గాలను గురించి చర్చించింది. మామూలుగా సరఫరా చేయబడే విత్తనాలు మంచివికావనీ, వాటి పంపిణీ విధానంలో లోపాలున్నాయని అంగీకరించబడింది. ఈ విషయంలో సహకార సంఘాల కృషికూడా పూర్తిగా విఫలమైంది. ఆపైన విత్తనాలు వాడకానికి తగినట్టుగా సరఫరా చేయబడ్డంలేదు. ప్రతిబ్లాకులోను విత్తనాల క్షేత్రాలు, స్టోర్లు యేర్పాటు చేయాలని సూచించబడింది, అలాగే రసాయన యెరువుల సరఫరా కూడా తగినంత లేదు. అవి సకాలంలోకూడా సప్లయి చేయబడ్డంలేదు. సప్లయిల కార్యక్రమాన్ని పంచాయతీలకు అప్పగించాలన్న సూచనకు సుముఖత కన్పించింది. అమ్మోనియం సల్ఫేటు, నైట్రేటుల్ని యింకా యెక్కువగా సప్లయి చేయాలని మరొక సూచన చేయబడింది. సహకార పద్ధతిపై సమిష్టి వ్యవసాయం చేయాలని ప్రతిపాదించబడింది. సమిష్టి వ్యవసాయంలో శిక్షణకి యేర్పాటు చేయాలని వ్యవసాయశాఖవారిని అడగడం జరిగింది.

కోళ్ళపెంపకాన్ని అభివృద్ధిచేసి, లాభదాయకమైన పద్ధతిలో కోళ్ళ పెంపకం యూనిట్లను నడిపేవిషయం సమా



*కేంద్ర ప్రభుత్వానికి బదిలీఅయిన డెవలప్‌మెంటు కమీషనరు, ప్రధాన కార్యదర్శి అయిన శ్రీ ఓ. పుల్లారెడ్డిగారు ఉపన్యసిస్తున్నారు.*



*అంతర్-రాష్ట్ర సెమినార్‌లో ప్లానింగు, డెవలప్‌మెంటు కార్యదర్శి శ్రీ సి. నరసింహంగారు మాట్లాడుతున్న దృశ్యం.*

లోచించబడింది. విదేశీ పశువుల పెంపకాన్ని వ్యాపింపచేయాలని, నిర్ణీతమైన స్థానిక రకాలనుంచి మేలుజాతి పశువులను సాధించాలని సిఫార్సు చేయబడింది. జలాశయాలు మున్నగునవి వుండి మంచి అవకాశాలు వున్న బ్లాకులలో మత్స్య సంపదను వృద్ధిచేయాలని సిఫార్సు చేయబడింది. సమాజాభివృద్ధి దృష్ట్యా పశుసంపదను అభివృద్ధిచేసే విషయం చర్చించబడింది.

సహకారం విషయంలో తీవ్రమైన విమర్శలు వచ్చాయి. కాని చర్చలు అసంపూర్ణంగా వున్నట్టు కనబడింది. సహకార సంఘాలు ఉత్తమకృషి చేయలేదనీ, యికముందు ఆ విషయంలో శ్రద్ధ తీసుకోవాలని అందరూ అంగీకరించారు. ఆ సంఘాలు మరీ వేగంగా విస్తరించాయికాని కేవలం ఋణగ్రహీతల సంఘాలుగా వున్నయి. రైతులకి అప్పులు యిచ్చే సంస్థలు చాలా వున్నాయి. ఇందువల్ల పరస్పర అవరోధాలు, అప్పులు యెక్కువ పుచ్చుకొనడం జరుగుతున్నది. సహకార సంఘాల వ్యాపారం మీదనే యెక్కువ శ్రద్ధ చూపబడుతున్నందున సన్నకారు వ్యక్తుల ఉద్ధరణకై అసలు యేమీ కృషి జరుగడం లేదు. పరపతి అర్హత విషయంలో కఠినమైన నిబంధనలున్నందున చాలమంది రైతులు అప్పును తీసుకొనడానికి వీలులేక పోతున్నది. ఆపైన అప్పులు సకాలంలో యివ్వబడనందున అవి నిరుపయోగమై పోతున్నాయి.

సహకార పరపతి యొక్క కొత్త సిద్ధాంతం ప్రకారం సహకారం యొక్క లాభాలను ప్రతి కుటుంబానికి విస్తరింపచేయాలి. ఈ విషయాన్ని మనస్సులో పెట్టుకుని ఒక వ్యక్తికి అప్పుతీసుకునే అర్హత వుందాలేదా అన్నదానికి కాక ఒక ప్రయోజనానికి అప్పు యివ్వవచ్చునా అన్నదానికి హెచ్చు ప్రాధాన్యత యివ్వాలన్న సూచన బలపరచబడింది. ఈ విషయాన్ని యువకులైన కొందరు కలక్టర్లు నూతన దృక్పథంతో చాలా బాగా వాదించారు. అప్పులన్నిటిని ఒకే యేజన్సీ ద్వారా యిప్పించే విషయము, చిన్న రైతులకు అప్పులు యివ్వడంలో గ్రామ కమిటీలు; పలుకుబడిగల వ్యక్తులు బాధ్యత పంచుకోడానికి తీసుకునే చర్యల విషయము ప్రభుత్వ పరిశీలనలో వున్నాయని ప్లానింగుశాఖ కార్యదర్శి చెప్పారు. ఈ సమయానికి చర్చ వాదోపవాదాలలో పడిపోయింది. అప్పుడు ముఖ్యమంత్రి జోక్యం కల్పించుకుని సహకార సంఘాలు ధర్మసంస్థలు కావన్నారు. ఆస్తి హామీని సడలించడానికి ఉపనియమాలు అంగీకరించ

వనీ, కాని ఆస్తులు లేనివారు అప్పులు తీసుకోడానికి వీలుగా వాటిని సడలించవచ్చుననీ అన్నారు. ఈ విషయాన్ని జాగ్రత్తగా పరిశీలించాలికాని యిప్పుడే యిక్కడ నిర్ణయాలు తీసుకొనడం సాధ్యంకాదన్నారు.

ఇక్కడ యీ సమావేశంలో నా దృష్టి నాకర్షించిన ఒక విషయాన్ని గురించి చెబుతాను బాధ్యతగలవారందరు మర్యాదక్రమాన్ని నిలబెట్టడంలో సహకరించారు. కార్యదర్శి తరుచు జోక్యం కలుగజేసుకొని ఆ యా విషయాలలో సందేహ నివృత్తి చేసి, ఆవిధంగా యింకా వాదోపవాదాలు జరుగకుండా నివారించేవారు. అధ్యక్షులు సమయజ్ఞతతో అధిక అనుచిత ప్రసంగాలను ఆపేసేవారు. ఆఖరికి ముఖ్యమంత్రికూడా తరుచు లేచి అప్రస్తుతంగా, మొండిగా చేసే ప్రసంగాలను ఆపుచేసినారు ఉదాహరణకు గ్రూపుచర్చలలో తన అభిప్రాయాన్ని నెగ్గించుకోలేని ఒక అధికారి బహిరంగ సమావేవశంలో మాట్లాడ్డానికి అధ్యక్షుడు అభ్యంతరం చెబుతున్నప్పటికీ కూడా ప్రయత్నించాడు. ముఖ్యమంత్రి జోక్యంకలుగజేసుకొనగా ఆ అధికారి ప్రారంభ దశలో తనను మాట్లాడనివ్వలేదని వాదించారు. "ఐతే మళ్లీ విద్వద్గోష్ఠి వరకూ వేచివుండండి. దయయుంచి కూర్చోండి." అని ముఖ్యమంత్రి ఆయనను కూర్చోబెట్టేసరికి సభ అంతా కలకల నవ్వింది. సమావేశం బహు చాతుర్యంగా నడిపించబడింది. ఆఖరికి కేంద్రమంత్రి శ్రీ ఎస్. కె. డే. కూడా ఒక విషయాన్ని వివరించో లేక యేదో ఒక సూచనను చేసో క్లిష్టపరిస్థితిని దాటిస్తూవుండేవారు. నిపుణమైన ఆయన తోడ్పాటు తరుచు యెంతో సహాయకారిగా వుండేది

ఈ సమావేశంలో వినోదక్షణాలుకూడా లేక పోలేదు. కునుకు తీస్తున్న ఒక అధికారి కన్పించే సరికి ప్రేక్షకులు కడుపుబ్బ నవ్వారు. ఒకమూల కార్యక్రమం జరుగుతూండగానే కునుకుతీస్తున్న కొందరు అధికార్లు నాకంటబడ్డారు ఒకసారి కేంద్రసమాజాభివృద్ధి మంత్రి ప్రసంగిస్తున్నారు. ఉపన్యాసం అనర్గళంగా, వుత్తేజకరంగా వుంది ఆ సమయంలో ఒక డైరెక్టరు నోరు తెరుచుకుని నిద్రిస్తున్నారు. ఆయనొక్కరేకాదు ఒక ప్రభుత్వ కార్యదర్శి, రెవిన్యూబోర్డు సభ్యుడూకూడా అదే పని చేస్తున్నారు అయితే మధ్యాహ్నం అల్పాహారం కాగానే యిది జరిగినందున దీనిని తప్పుపట్టడానికి వీలులేదు. ఇక చమత్కారంగా మాట్లాడి నవ్వించిన ఘట్టాలు గురించి చెబుతాను వయోవృద్ధులయిన ఒకరు మాట్లాడుతూ "ఆలోచించని వాళ్ళు అర్థం చేసుకోలేరని" అనే సరికి ప్రేక్షకులు విరగబడి నవ్వారు. ఒకసారి ఒక సీనియరు ఆఫీసర్ తన అభి



అంతర్-రాష్ట్ర సెమినార్‌లో వివిధ శాఖల ప్రతినిధులు సుమారు 500 మంది పాల్గొన్నారు.



సెమినార్‌లో శ్రీ యం. వి. పాయ్ అధ్వర్యాన అధికారులు చర్చలు జరుపుతున్న దృశ్యం.

ప్రాయాన్ని విశదీకరిస్తూ అదే పనిగా మాట్లాడేసరికి అయన్ని ఆపుచేయడానికై అధ్యక్షుని కాల్‌బెల్లును ముఖ్య మంత్రి స్వయంగా మోగించారు. (మళ్ళీ నవ్వులు.) ఒక గ్రూపునాయకుడు మాట్లాడుతూ ఒక ఐ. ఏ. యస్. ఆఫీసర్ "ఇప్పుడు సాంకేతిక ఆఫీసర్ అయ్యాడు" అని చెప్పాడు. అతడు ఒక సాంకేతిక శాఖకు అధిపతి. సాంకేతిక అధి కార్లకి స్వతంత్రమైన అధికారాలను యివ్వాలని వాదిస్తు న్నాడు. ఒక వుద్యోగి తరుచు లేచి నిలబడుతూ వుంటె "ఊరికే నుంచోవడమేనా" అని ముఖ్యమంత్రి అన్నారు. ఈవిధంగా కార్యక్రమం వుల్లాసంగా జరిగింది. అలాగని చిన్న చిన్న పట్టుదలలు వచ్చిన సమయాలుకూడా లేక పోలేదు.

## నిర్వహణాధికారాలు

సమాజాభివృద్ధి బ్లాకుల యొక్క డిసిప్లినరీ కంట్రోలు విషయం చర్చకు వచ్చినపుడు అభిప్రాయభేదాలు వచ్చాయి. సాంకేతికులు తమకి స్వతంత్రమైన అధికారాలు కావా లన్నారు. ద్వంద్వ పరిపాలన వున్నప్పుడు ద్వంద్వాధి కారాలు కూడా వుండాలని వారి వాదన. కలక్టర్లు సహజం గానే కలక్టరు యొక్క డిసిప్లినరీ కంట్రోలు వుండాలని వాదించారు. పరిపాలనాధికారం సాంకేతికశాఖల చేతిలోనికి వెడితే జిల్లా పరిపాలనా వ్యవస్థ దెబ్బతింటుందని, అభి వృద్ధి ప్రాంతానికికూడా అది మంచిది కాదని వారి వాదన. వ్యక్తుల్ని వుద్దేశించి మాటలు విసరడం, తరుచు నిందలు వేయడం ఆరంభమయేసరికి కేంద్రమంత్రి జోక్యం కలుగ చేసుకుని అనర్గళంగా వుపన్యసించారు. దానితో కలెక్టర్లూ సాంకేతికులూ కూడా విషయాన్ని సరైన దృక్పథంలో అర్థం చేసుకున్నారు.

పరిపాలనాధికారులు, సాంకేతిక విషయజ్ఞులు కలసి సమష్టిగా నిర్వహించే కార్యక్రమమే సమాజాభివృద్ధి అని యూనియన్ మంత్రి నొక్కి చెప్పారు. ఇరుపక్షాలవారుకూడా కర్తవ్యనిష్ఠులై, ప్రజాసేవా పరాయణులై కలసి పనిచేయా లన్నారు. అధికారాలు పరస్పరం సహకరించుకొనే కొత్త పద్ధతి ఒకటి యేర్పడింది. ఇప్పటికీ జిల్లా పరిపాలనాధిపతి కలక్టరే అయినప్పటికీ సమాజాభివృద్ధి విషయంలో ఆతడికి సాంకేతిక విషయజ్ఞుల తోడ్పాటు కావాలి. ఇప్పుడు అతడి

బాధ్యత కేవలం శాంతి భద్రతలను కాపాడి, పన్నులు వసూలు చేయడమేకాదు అతడు జిల్లాలో సంక్షేమ కార్యక్రమాన్ని నడిపించాలి. అధికారులు పరస్పరం సహకరించుకోడానికి ప్రతిష్ఠ అడ్డురాకూడదు. మీకు పనియందు శ్రద్ధ వుండి, సేవా భావాలతో వుపక్రమించినట్లయితే, యీ ప్రపంచంలో యే శక్తి కూడా మిమ్మల్ని అడ్డలేదు. సాంకేతికులు గ్రామస్థాయిలో ప్రజలను వుత్తేజితుల్ని చేయాలంటే వారికి బాధ్యతను యివ్వాలి కాని భయపడుతూ చేయవలసిన పనిని యివ్వకూడదని మనం గ్రహించాలి. అధికారాన్ని కొంత పంచాలి. ఉద్యోగులు పరస్పరం పోటీ పడకుండా పనిని వికేంద్రీకరించి, అధికారాలను పంచి యివ్వాలి. మరి మనం గొప్ప మార్పును—శ్రేయోరాజ్యాన్ని పొందుతున్నాం అని ఆయన నొక్కి చెప్పారు.

## స్త్రీలు

ఈ విద్వద్గోష్ఠికి కొందరు స్త్రీలు కూడా వచ్చారు. వారు అక్కడ అలంకారప్రాయంగా కూచోటానికి రాలేదు. చర్చలలో ముఖ్యంగా సాంఘిక విద్య, స్త్రీ సంక్షేమాలకి సంబంధించిన చర్చలలో పాల్గొన్నారు. మాట్లాడినముగ్గురు కూడా చాలా చక్కగా మాట్లాడారు. సాంఘిక విద్య విషయంలో, కేంద్ర సాంఘిక సంక్షేమబోర్డు, స్త్రీ సంక్షేమ కార్యకలాపాల ఆర్గనైజేషన్ల కార్యక్రమాలలో పరస్పరావరోధాలు కలుగుతున్నందున యేకీకృతమైన కార్యక్రమం రూపొందించ బడాలని సూచించబడింది సాంఘిక విద్యా ఆఫీసర్లు విపులమై, నిర్దిష్టమైన పాత్రను వహించవలసి వున్నందున వారి కార్యకలాపాన్ని అన్యత్రా మళ్ళించకూడదని అభిప్రాయం వ్యక్తమైంది.

## ప్రజలు పాల్గొనడం

"ప్రజలు పాల్గొనడం" అనేది విద్వద్గోష్ఠి ముఖ్య నిర్ణయంగా వుంది. ముఖ్యమంత్రి, కేంద్రమంత్రి కూడా యీ విషయాన్ని నొక్కిచెప్పారు పథకం గ్రామీణుని సమీపిస్తే దానిలో ప్రజలుపాల్గొంటారని శ్రీ సంజీవరెడ్డి వాక్రుచ్చారు. ప్రతి గ్రామానికీ, గ్రామంలోని ప్రతి కుటుంబానికీ ఒక పథకం వుండాలి ప్రజా సహకారాన్ని సంపాదించవలసిన గ్రూపు యీ విషయాన్ని చర్చించింది. జాతీయ వికాస సేవా పథకాల క్రింది కార్యక్రమాన్ని యెటుబడితే అటు మళ్లించడానికి వీలులేనందున అవి పూర్తిగా అమలుపరచబడ్డంలేదు అన్ని విషయాల్ని పంచాయితీలకు అప్పగించే యేర్పాటుచేయాలి. గ్రామీణజీవితాన్ని మెరుగుగా, యెక్కువ



సెమినార్ అయిన తరువాత సాంస్కృతిక ప్రదర్శనంలో పంచవర్ష ప్రణాళికపై ఏర్పాటుచేయబడిన ఖవాల
(ఉర్దూలో కవితా గానం)

ఆనందమయంగా చేయడం ఆదర్శమయినప్పటికీ, దానిని సాధించడం యిప్పట్లో సాధ్యంకాదని. అది కేవలం ఆదర్శవాదమని వారి అభిప్రాయం. ప్రతి జిల్లాలోను కొన్నిగ్రామాలలో యీ కార్యక్రమం ప్రయోగాత్మకంగా ప్రవేశపెట్టబడుతుంది. అది గ్రామంలోని ప్రతి కుటుంబాన్నీ స్పృశిస్తుంది ఆ విధంగా ఒక ఆదర్శగ్రామం సాధించబడుతుంది.

## సాంస్కృతిక కార్యక్రమం

మూడురాత్రులు ప్రేక్షకులవినోదార్థం జరిగిన సాంస్కృతిక కార్యక్రమాల్ని గురించి చెప్పనిదే విద్వద్గోష్ఠి సమీక్ష పూర్తికాదు. ఏర్పాట్లు చాలా విపులంగా వున్నాయి. ప్రతి రాత్రి యించుమించు 30 రకాల ప్రవర్శనలు జరిగాయిట. అవి బాగానే వున్నాయిట కాని అన్నీ ఒకేమోస్తరుగావుండి విసుగెత్తించాయిట

గోష్ఠి మూడవరోజు తెలంగాణా వ్యవహారాలకు వుద్దేశించబడింది. ప్రముఖులైన అతిథులు నిజంగా చాలా వుత్తేజకరంగా మాట్లాడారు. ముఖ్యమంత్రి ప్రసంగం వుద్యోగులకి నావంటివారి గౌరవాని కాస్పదమైంది. శ్రీ ఎస్. కె. డే. ప్రత్యేకించి అవినీతి విషయమై మాట్లాడారు. అవినీతికి మూలకారణం ఆలస్యంగా పనులు జరపడమని ఆయన చెప్పారు ప్రభుత్వ యంత్రం వివిధస్థాయిలలో సరిగా నడవడంలేదని సామాన్యమానవులు కనుగొన్నప్పుడు చక్రాలకి చమురుపెడతారు. ఉద్యోగులు పనులను ఆలస్యం చేయక పోయినట్లయితే, లంచమిచ్చి వాటిని సత్వరం జరిపించుకొనవలసిన అవసరం వుండదు. పనిని శీఘ్రంగా చేయాలని ఆయన చెప్పారు.

ప్రభుత్వోద్యోగులు సమాజాభివృద్ధి కార్యక్రమం పట్ల తమ దృక్పథాన్ని మార్చుకోవాలనికూడా ఆయన చెప్పారు. అది వారి కర్తవ్యములో ఒక భాగమే అన్నారు. అది ప్రభుత్వ కార్యక్రమమనీ, ప్రభుత్వ శాఖాధికారులు దానితో సహకరించడమేకాక దానిలో పాల్గొనాలని ఆయన అన్నారు. సమాజాభివృద్ధి. విస్తరణ రంగాలలో ఆంధ్రప్రదేశ్ యింతవరకూ సాధించిన ఫలితాలను ఆయన ప్రశంసించారు. అలాగని వుద్యోగులు తృప్తిచెంది వూరుకోరాదని కూడా ఆయన హెచ్చరించారు.

శ్రీ వి. బి. రాజు గోష్ఠినిముగిస్తూ గోష్ఠి విజయవంతం కావడానికి తోడ్పడిన వారందరినీ ప్రశంసించారు. నిజానికి అది విజయవంతం కావడానికి యెక్కువ పాటుపడినది ఆయనే. గోష్ఠి విజయవంతం కావడానికి చక్కని యేర్పాట్లు చేసిన ప్లానింగు శాఖ కార్యదర్శి శ్రీ నరసింహం కూడా ప్రశంసార్హులు. వచ్చిన సూచనలను అమలుపరచే బాధ్యత ఆయనపైనే వున్నది. నేను యిదివరకే చెప్పినట్టు యీ విద్వద్గోష్ఠి వ్యవహార సరళిలో నడిచింది. ఇదివరకిటువంటివి జరుగలేదు.



*సాంస్కృతిక ప్రదర్శనంలో ఒక నృత్య సన్నివేశం. — "భారతమాత"*

# పరిశీలక బృందముల సిఫార్సులు



ఆంధ్రప్రదేశ్‌లో సామాజికాభివృద్ధి కార్యక్రమాలను గూర్చి జరిగిన రాష్ట్ర విద్వద్గోష్ఠిలో చర్చకై నిర్ణయింపబడిన విషయాలు ఈ క్రింది ఆరు గ్రూపులుగా విభజింపబడ్డవి.

1. అధిక వ్యవసాయోత్పత్తి
2. పశు సంరక్షణ, మత్స్యసంపద, సహకారం
3 కుటీర పరిశ్రమలు, సాంఘికవిద్య
4. ఆరోగ్యం, పారిశుధ్యం. స్థానిక అభివృద్ధి పనులు
5. పరిపాలన
6. ఉద్యోగుల శిక్షణ, అభివృద్ధి కార్యక్రమాలలో ప్రజల పాల్గొనడం.

ఈ విషయాలను గూర్చి వివిధబృందాలు సమర్పించిన నివేదికలలో ఈ దిగువ సిఫారసులు కలవు:-

### ఉమ్మడి సేద్యం

ప్రభుత్వ బంజరుభూములను కేటాయించడంలో సాధ్యమైనంతవరకు ఉమ్మడిసేద్యాన్ని జరిపించే సహకార సంఘాలకు ప్రాధాన్య మివ్వవలెననీ, వ్యవసాయ సహకారశాఖకు చెందిన ఉద్యోగులకు ఉమ్మడిసేద్యం విషయంలో శిక్షణ ఇప్పించవలెననీ పరిశీలక బృందం సిఫార్సుచేసింది

### కమతాల ఏకీకరణ

ప్రభుత్వం రాష్ట్రమంతటా మాగాణిభూమి అయితే 25 సెంట్లకు, మెట్టభూమి అయితే 50 సెంట్లకు తగ్గే సందర్భాలలో కమతాల విభజనకు



*కేంద్ర కమ్యూనిటీ డెవలప్‌మెంటు మంత్రి యస్. కే. డే., ఆంధ్రప్రదేశ్ కాంగ్రెసు కమిటీ అధ్యక్షులు శ్రీ ఎ. సత్యానారాయణరాజు, ముఖ్యమంత్రి సాంస్కృతిక ప్రదర్శనాన్ని తిలకిస్తున్న దృశ్యం.*



వీధిభాగవతంలో ఒక సన్నివేశం.

ఆమోదం ఇవ్వరాదనీ, వ్యక్తులు గనుక కొద్దిపాటి భూములను మార్పిళ్ళు చేసినట్లయితే అట్టి సందర్భాలలో జాయింటు పట్టాదార్లుగా మాత్రమే రిజిష్టరు చేయవలెననీ పరిశీలక బృందం గట్టిగా సిఫార్సుచేసింది. ఇందువల్ల భూములు ముక్కలు చెక్కలు గాకుండా కొంతవరకు నిరోధింపబడడం జరుగుతుంది. పంజాబు, ఉత్తరప్రదేశ్, తదితర రాష్ట్రాలలోవలె ఈ రాష్ట్రంలో కూడా కమతాల ఏకీకరణ జరుపబడవలెనని పరిశీలక బృందం గట్టిగా సిఫార్సు చేసింది.

## కీలక గ్రామకేంద్రాలు

పశువులమేత సరఫరా అవశ్యకతను గుర్తించిన మీదట సిలోపిట్ల నిర్మాణానికీ, సిలేజి ఉపయోగాన్ని వ్యాప్తిలోకి తేవడానికీ సబ్సిడీలను సిఫారసు చేయుటకు అంగీకరింపబడింది.

పశుగణాభివృద్ధి చట్టం మాదిరిగా ఒక శాసనాన్ని తెలంగాణా ప్రాంతానికి కూడా వర్తింపజేయవలెననీ సంయోగంకొరకు కేటాయింపబడే కోడెల అర్హతను కూడా పరిశీలించవలెననీ అంగీకరింపబడింది.

## పరపతి సౌకర్యాలు

పరపతిలేనట్టి చిన్నపాటి రైతులకు పరపతి కల్పించవలసిన బాధ్యతను గ్రామ అభివృద్ధి కమిటీలు, ఇతర స్వచ్ఛంద సంస్థలు, గ్రామంలోని పలుకుబడిగల వ్యక్తులు వహించవలెనంటూ చేయబడిన సూచనకు పరిశీలకబృందం వారు తమ ఆమోదం తెలిపారు.

## సాంఘిక విద్య

సాంఘిక విద్యా ఆర్గనైజర్లు చేస్తున్న పనిపై సమర్థవంతమైన పర్యవేక్షణ ఉండుటకుగాను జిల్లా సాంఘిక విద్యాధికారుల ఉద్యోగాలను సృష్టించవలెనని పరిశీలక బృదం సిఫారసు చేసింది.

## ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలు

బ్లాకు ప్రధానకేంద్రాలలో ఆరు మంచాలుగల ఆసుపత్రి సౌకర్యం లేనట్లయితే అటువంటిచోట్ల ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలను నెలకొల్పవలెను. ఒకవేళ అటువంటి సౌకర్యం ఇదివరకు లేనట్లయితే ప్రాథమిక ఆరోగ్య కేంద్రాన్ని ఎటువైపునుంచి

చూచినా మధ్యలో వుండేటువంటి గ్రామంలో పెట్ట వలెను.

### ప్రతి గ్రామానికీ ఒక ప్రణాళిక

మొదట ప్రతి జిల్లాలో ఒక గ్రామాన్ని ఎన్నిక చేయవలెను. ఆ గ్రామంలో అభివృద్ధి కార్యక్రమం ప్రతి కుటుంబానికీ సంబంధించి ఉండవలెను. దాన్ని ఆదర్శగ్రామంగా చేయవలెను. అందులో ఈ దిగువ సౌకర్యాలు కల్పించబడవలెను.

(అ) గ్రామవాసు లందరికీ వ్యవసాయం, చేతి పరిశ్రమలు, ఇతర వృత్తులలో పనులను కల్పించవలెను.

(ఆ) ప్రతి కుటుంబానికీ కనీస గృహవసతి.

(ఇ) ప్రతి కుటుంబం తగినంత ఆహారం, వస్త్రం, ఇతర అవసర వస్తువులను కొనగలిగే విధంగా దాని కొనుగోలుశక్తిని పెంపొందించడం

(ఈ) గ్రామ పారిశుధ్యత, స్వచ్ఛమైన మంచినీటి సరఫరా.

(ఉ) విద్యా వైజ్ఞానిక సౌకర్యాలు - ఒక పాఠశాల, ఒక గ్రామమందిరం.

(ఊ) పూర్తి వైద్య సౌకర్యాలు - కుటుంబ నియంత్రణకు సంబంధించిన సలహాలు.

ఆదర్శగ్రామంగా అభివృద్ధి చేయవలెనని ఒక గ్రామాన్ని ఎన్నిక చేసేటప్పుడు పై అంశాలన్నిటికీ గ్రామస్తులు సహాయ సహకారాలు ఇవ్వడానికి సిద్ధంగా వున్నారా లేదా అన్న విషయాన్ని తేల్చుకోవలెను.

### జాయింట్ కలెక్టర్ల నియామకం

జిల్లాకలెక్టర్లకు రోజువారీ మామూలు పనిని తగ్గించడానికై హోదాలో డిప్యూటీకలెక్టరు కంటె ఎక్కువగాను, జిల్లాకలెక్టరుకు లోబడి ఉండునట్టి జాయింట్ కలెక్టర్లను నియమించవచ్చు.

### పరిశీలన నిమిత్తమై పర్యటనలు

రాష్ట్రంలోను, రాష్ట్రం వెలుపల వున్నట్టి బ్లాకులలో జరుగుతున్న కృషిని చూడడానికి అనధికారులతో కూడిన ప్రతినిధివర్గాలను పంపడం మంచిదని పరిశీలక బృందం సిఫార్సు చేసింది ఇందు నిమిత్తమై రాష్ట్రాన్ని సర్కార్లు, రాయలసీమ, తెలంగాణా



*వీధిభాగవతాన్ని ప్రశంసిస్తున్న ప్రముఖ ప్రేక్షకులు.*



సాంస్కృతిక ప్రదర్శనాన్ని తిలకిస్తున్న మహిళలు.



సాంస్కృతిక ప్రదర్శనంలో సామర్లకోటలోని గృహ విజ్ఞాన శాస్త్ర విభాగానికి చెందిన మహిళలు ప్రదర్శించిన నృత్యం.
కథావస్తువు : "భారత నారి"



*నూజివీడు నివాసిని కుమారి విజయలక్ష్మి భరతనాట్యం చేస్తున్న దృశ్యం.*

అని మూడు ప్రాంతాలుగా విభజించవలెననికూడా సిఫారసు చేసింది. ఒక ప్రాంతంవారిని మరొక ప్రాంతానికి పర్యటనకు పంపాలి. ఒక్కొక్క పర్యటన బృందానికి ప్రతిజిల్లానుంచి నలుగురు వ్యక్తుల్ని ఎన్నిక చెయ్యాలి. వారిలో ఒకరు ఏదేని సంఘసేవా సంస్థకు చెందినవారై వుండాలి రాష్ట్రం వెలుపలి బ్లాకులలో పర్యటించే ప్రతినిధివర్గంలో రాష్ట్రంలోని మూడు ప్రాంతాలకు చెందిన ప్రతినిధులు వుండాలి. అంతేగాక ప్రతిజిల్లా యొక్క బ్లాకు సలహాసంఘంలోని సభ్యులలో నుంచి ఇద్దరిని, కుటీర పరిశ్రమలు, సంఘసేవ, లలితకళలు ఇత్యాది వృత్తులకు సంబంధించినట్టి వారిని పదిమందిని ఆ ప్రతినిధివర్గంలో చేర్చుకోవాలి.

* * * *

# ఆంధ్రప్రదేశ్‌లో పంటల పోటీలు

1955-56 సంవత్సరమున ఆంధ్ర తెలంగాణ ప్రాంతములలో జరుపబడిన పంటల పోటీలలో "రాష్ట్ర బహుమతు" లందుకున్న రైతులు .

వరి

(ఆంధ్ర ప్రాంతము)

శ్రీ కె. జానకిరామరాజు

అర్తము గ్రామము, పార్వతీపురము తాలూకా

శ్రీకాకుళము జిల్లా

పంట దిగుబడి: ఎకరమునకు 10,290 పౌన్లధాన్యము.

("అబి" పంట - తెలంగాణా ప్రాంతము)

శ్రీ ఆర్. శేషరావు

నల్లపల్లి గ్రామము, నర్సాపూరు తాలూకా.

మెదకు జిల్లా.

పంట దిగుబడి. ఎకరమునకు 12,397 పౌన్లధాన్యము.

("తాబి" పంట - తెలంగాణా ప్రాంతము)

శ్రీ డి. వెంకటరెడ్డి

తల్కొండపల్లి గ్రామము, మహబూబ్‌నగర్ జిల్లా.

పంట దిగుబడి. ఎకరమునకు 10,080 పౌన్లధాన్యము.

జొన్న

(ఆంధ్ర ప్రాంతము)

శ్రీ వి. రామకృష్ణారెడ్డి

ఆత్మకూరు, కర్నూలు జిల్లా.

పంట దిగుబడి ఎకరమునకు 5,963 పౌన్లు

చెరకు

(ఆంధ్ర ప్రాంతము)

శ్రీ బాలక శివరామిరెడ్డి

బాలకవారిపల్లి గ్రామము, మదనపల్లి తాలూకా

చిత్తూరు జిల్లా.



*పంటల పోటీలో గెలుపొందిన శ్రీ రాఘవేంద్రరావు అను రైతుకు ముఖ్యమంత్రి బహుమతి ఇస్తున్న దృశ్యం*



*పంటల పోటీలో గెలుపొందిన శ్రీ డి. వెంకటరెడ్డి అను రైతుకు ముఖ్యమంత్రి బహుమతి ఇస్తున్న దృశ్యం.*

పంట దిగుబడి : ఎకరమునకు 107 టన్నుల, 1020 పౌన్ల చెరకు.

### వేరుశనగ

(తెలంగాణా ప్రాంతము)

శ్రీ రాఘవేంద్రరావు

పోతవరము, కరీంనగర్ జిల్లా.

పంట దిగుబడి : 4,800 పౌనులు.

### ప్రత్తి

(తెలంగాణా ప్రాంతము)

శ్రీ గణపతిరావు దొండబా

జమడి గ్రామము, ఆదిలాబాదు జిల్లా.

పంట దిగుబడి : ఎకరమునకు 2,997 పౌనుల గింజప్రత్తి.

దేశం మొత్తంమీద రైతులందరు కూడ ఇతోధికంగా కృషిచేసి ప్రతి ఎకరమునుండి వ్యవసాయోత్పత్తులను ఇంకా ఎక్కువ చేయడానికి ప్రోత్సహించే వుద్దేశంతో పంటల పోటీలు భారతప్రభుత్వమువారిచే మొట్టమొదటగా 1950-51 లో ప్రవేశపెట్టబడినవి. ఈ పోటీలు ప్రారంభంలో అప్పుడున్న 'అధికాహారోత్పత్తి' కార్యక్రమాలలో ఒకభాగంగా వుండినవి. వీటి నిర్వహణ విషయంలో ఎక్కువ శ్రద్ధ, ఆసక్తి కనబరచవలెనని రాష్ట్రప్రభుత్వాలను కేంద్రప్రభుత్వము కోరుతూ, కొన్ని విషయాలలో, అంటే సిబ్బంది, బహుమతులు మొదలైనవాటికి కొంత ధనసహాయముకూడ చేస్తూవచ్చింది. తొలుదొల్త ఈ పంటల పోటీలు వరి, జొన్నపంటలకే పరిమితమై ఉండి రానురాను చెరకు, పొగాకు, ప్రత్తి, వేరుశెనగపంటలలో కూడ నడుపబడుతూ వున్నవి.

వరి, జొన్న, చెరకు వంటి పంటల విషయంలో గత మూడు సంవత్సరాలుగా ఎందరు పోటీదారులు పాల్గొన్నదీ క్రింద పట్టికలో చూడవచ్చును. ఇన్ని సంవత్సరాలుగా ఈ 'పంటలపోటీలు' చాల జయప్రదంగా జరుగుతూవుండడము ముదావహమైన విషయం.

జరిగిన మూడు సంవత్సరములలో ఆంధ్రప్రదేశ్‌లో పంటలపోటీలలో పాల్గొన్నవారి సంఖ్య.

| | 1953-54 | 54-55 | 55-56 |
|---|---|---|---|
| వరి | 28577 | 26817 | 39720 |
| జొన్న | 882 | 1482 | 3341 |
| చెరకు | 157 | 388 | 3331 |

సరాసరి పంట దిగుబడులు (ఎకరానికి) పౌనులలో

| | ఆంధ్రప్రదేశ్ | ఇండియా | ప్రపంచం |
|---|---|---|---|
| వరి | 1521 | 1122 | 1452 |
| జొన్న | 405 | 364 | 736 |
| చెరకు (బెల్లము) | 6713 | 2952 | ... |
| చెరకు | 27టన్నులు | 13టన్నులు | ... |

# ఆంధ్రప్రదేశ్‌లోని వ్యవసాయ పరిశోధన స్థానములు

| వ్యవసాయ పరిశోధన స్థానము | ఏ పైర్లపై పరిశోధన జరుగుచున్నది | ఉత్పత్తి అయిన వంగడములు |
|---|---|---|
| 1. వ్యవసాయ పరిశోధన స్థానము శ్రీకాకుళం. | వరి, చిరుధాన్యములు, గోగు | 1955 డిసెంబరున ఆరంభించబడెను. ఈ ప్రాంతమునకు సరిపడు వరి మొదలగు వంగడముల నేర్పరచుటకు గాను భూమిని స్వాధీనపరచుకొనుట జరిగినది; వసతిగృహముల నిర్మాణము జరుగుచున్నది. |
| 2. అరకులోయ పరిశోధన స్థానము అరకు. | వరి, చిరుధాన్యములు, పండ్లు కూరగాయలు. | ఏర్చిన వంగడములు; పండ్లమొక్కలు గిరిజనులకు అందజేయబడుచున్నవి. |
| 3. ప్రభుత్వ చిరుధాన్య స్థానము విజయనగరము. | జొన్న, రాగి, సజ్జ, నువ్వులు. | జొన్న : నెం. 138 (పచ్చజొన్న): రాగి: పునాస A. R. 256-1-2. పైరు : S. R. 124. |
| 4. చెరకు పరిశోధన స్థానము అనకాపల్లి. | చెరకు, వరి, రాగి, పండ్లు | కొ. 527. తొలికాపునకు<br>కొ. 449. మధ్యకాపునకు<br>కొ. 419. తుది కాపునకు<br>వరి : ఎ. కె. పి. 1 నుండి 12 వరకు.<br>రాగి : ఎ. కె. పి. 1 నుండి 6 వరకు. |
| 5. అన్వేషణ - ప్రయోగ స్థానము రంపచోడవరము. | మన్యప్రాంతముల కనువగు ఫలజాతులు | ఫలజాతుల మొగ్గంట్లు, నారంట్లు అమ్మబడుచున్నవి. మన్యప్రాంతములోని వెనుకబడినజాతుల అభివృద్ధికి గాను ఏర్పరచిన ప్రణాళికక్రింద 1955 మార్చిలో స్థాపించబడెను. ఫలజాతుల సభివృద్ధిచేయు కార్యక్రమము సాగుచున్నది. |
| 6. ప్రభుత్వ చిరుధాన్య స్థానము పెద్దాపురము. | చిరుధాన్యములు, మెట్టవరి, పప్పు ధాన్యములు | పప్పులు, చిరుధాన్యముల యందు కార్యక్రమము సాగుచున్నది. |
| 7. వ్యవసాయ పరిశోధన స్థానము అనకాపల్లి. | వరి | S. L. O. 1 నుండి 19 వరకు ఉత్పత్తిచేయబడిన వంగడములు. |
| 8. ముంపుడు వరి పరిశోధన స్థానము పుల్ల. | వరి | P. L. A. 1 (రకము 5059) |
| 9. వ్యవసాయ పరిశోధన స్థానము మారుటేరు. | వరి | M. T. U. 1 నుండి 22 వరకు. |

| వ్యవసాయ పరిశోధన స్థానము | ఏ పైర్లపై పరిశోధన జరుగుచున్నది | ఉత్పత్తిఅయిన వంగడములు |
|---|---|---|
| 10. కొబ్బరి పరిశోధన స్థానము అంబాజీపేట. | కొబ్బరి | 1955 - 56 లో స్థాపింపబడెను. పరిశోధన కార్యక్రమము సాగుచున్నది. |
| 11. వరి పరిశోధన స్థానము మచిలీపట్టణము. | వరి | చవుడును నిరోధించు వరి వంగడములను నుత్పత్తి చేయుటకు 1954 - 55 లో స్థాపించబడెను. పరిశోధన కార్యక్రమము సాగుచున్నది. |
| 12. వ్యవసాయ పరిశోధన స్థానము లాము (గుంటూరు) | జొన్న, మిర్చి, ప్రత్తి, శనగ, ధనియము | జొన్న G 1 నుండి G 4 వరకు.<br>కొర్ర G 1.<br>మిర్చి: G 1; G 2.<br>ధనియము : G 14.<br>శనగ: నెం. 482. |
| 13. పసుపు పరిశోధన స్థానము పెదపాలెము. | పసుపు | 1955 లో స్థాపింపబడెను. పరిశోధన కార్యక్రమము సాగుచున్నది. |
| 14. ప్రత్తి ఉప పరిశోధన స్థానము నర్సారావుపేట. | ప్రత్తి | మిశ్రమసాగున కుపయుక్తమగు తెల్లపింజగల ప్రత్తి వంగడముల నుత్పత్తి చేయుటకు స్థాపించబడెను. |
| 15. వ్యవసాయ కళాబోధక స్థానము బాపట్ల. | వరి, రాగి, చెరకు, అరటి. పప్పులు, పండ్లు, కూరగాయలు. | కళాశాల విద్యార్థులకు శిక్షణ నిచ్చుటకు. |
| 16. ప్రభుత్వ చిరుధాన్య స్థానము ఒంగోలు. | పైరుజొన్న, వరిగ. | పైరుజొన్న, వరిగ, సజ్జ, కొర్రలపై పరిశోధన జరుగుచున్నది. |
| 17. పరిశోధక ప్రయోగ స్థానము మెమ్మిగనూరు. | వరి, జొన్న, ప్రత్తి, మిర్చి, ఉల్లి మొదలగునవి. | దంపసాగు (మాగాణిసాగు) పద్ధతులలో ప్రయోగము లపు వేసి ప్రయోజనములను నిరూపించుటకు; పరిశోధన సాగుచున్నది. |
| 18. ప్రాంతీయ బీజోత్పత్తి స్థానము ఆదోని. | చముదుగింజలు | వేరుశనగ, ఆముదపు వంగడముల నుత్పత్తి చేయుటకు. |
| 19. వ్యవసాయ పరిశోధన స్థానము నంద్యాల. | జొన్న, కొర్ర, ప్రత్తి | జొన్న N. 1 నుండి N. 12 వరకు<br>కొర్ర: N. 1<br>ప్రత్తి; N. 14 |
| 20. ఆదర్శ ఫలస్థానము గిద్దలూరు. | మామిడి, చీని, సపోటా, జీడిమామిడి, ద్రాక్ష, ఉసిరి | పేరొందిన ఫలజాతుల రకములను రైతుల కంద జేయుటకు 1953—54 లో స్థాపించబడెను. |
| 21. వ్యవసాయ వరి పరిశోధనస్థానము బుచ్చిరెడ్డిపాలెము. | వరి | BCP. 1 నుండి BCP. 5 వరకు. |
| 22. ప్రాంతీయ చముదుగింజల పరిశోధన స్థానము అనంతపురం. | మెట్ట సాగున కనువగు ఆముదము, వేరుశనగ, నువ్వులు, కుసుమ వంగడముల నుత్పత్తి చేయుటకు | 1954—55 లో స్థాపించబడెను. |
| 23. ఫల పరిశోధన స్థానము కోడూరు. | మామిడి, చీని, సపోటా, జామ, జీడిమామిడి, పనస, దానిమ్మ | వివిధ రకముల ఫలజాతుల మొక్కలను వృద్ధిచేసి రైతుల కందజేయుటయేకాక మామిడిలో 24 రకముల ఉపయుక్తమగు సంకరజాతుల నుత్పత్తిచేసిరి. |

| వ్యవసాయ పరిశోధన స్థానము | ఏ పైర్లపై పరిశోధన జరుగుచున్నది | ఉత్పత్తి ఆయిన వంగడములు |
|---|---|---|
| 24. పానగల్ ప్రయోగ స్థానము కాళహస్తి. | వరి, వేరుశనగ, అరటి, కూరగాయలు | ఇది ప్రయోగ స్థానము మాత్రమే. |
| 25. ప్రాంతీయ బీజోత్పత్తి స్థానము వాయల్పాడు. | చమురు గింజలు | ఎంచిన వేరుశనగ, ఆముదపు వంగడముల నభివృ పరచుట. |
| 26. వ్యవసాయ పరిశోధక స్థానము ముథోల్, ఆదిలాబాదు. | ప్రత్తి | G 6, G 12. ప్రత్తి వంగడములు. |
| 27. వ్యవసాయ పరిశోధక స్థానము రుద్రూరు, నిజామాబాదు. | భూసార, ఫలజాతుల సంబంధమగు సమస్య లనుచూచుట; వరి, చెరకు పంటల నభివృద్ధి. | RDR 2, RDR 4, RDR 7 రకముల వరి వంగడములు. |
| 28. వ్యవసాయ పరిశోధక స్థానము సంగారెడ్డి, నిజామాబాదు. | ఫలజాతుల నభివృద్ధి పరచుట : 1. సీతాఫలము, 2. సపోట, 3. మామిడి, 4. జామ, 5. దానిమ్మ. పంటల నభివృద్ధిపరచుట : 1. వరి, 2. జొన్న, 3. చమురుగింజలు, 4. కూరగాయలు. | C 11, C 28, C 36 పంట రోగ నిరోధకములగు కంది రకములు. |
| 29. బీజాభివృద్ధి స్థానము అంబరుపేట. | వరి, మొక్కజొన్న, కూరగాయలు. | ... |
| 30. వ్యవసాయ పరిశోధన స్థానము రాజేంద్రనగర్, హైద్రాబాదు. | భూమి, తత్సంబంధమైన సమస్యలు, ఉద్యాన కృషి క్రిమి, కీటకములు, --వరి, పప్పుధాన్యములు, చమురు గింజలు చిరుధాన్యములు, పశుగ్రాసములు మొదలైన వాటి యభివృద్ధి | H. M. 1; H. M. 2 మొక్కజొన్న H. C. 1; H. C. 6 ఆముదము |
| 31. వ్యవసాయ పరిశోధన స్థానము దిండి, నల్గొండ. | సస్యాభివృద్ధి :- వరి, చమురు గింజలు | .... |
| 32. వ్యవసాయ పరిశోధన స్థానము వరంగల్లు. | ఫల కృషిలోని సమస్యలు సస్యాభివృద్ధి:- వరి, పప్పు ధాన్యములు | ... |
| 33. వ్యవసాయ పరిశోధన స్థానము మధిర, ఖమ్మము. | పొగాకు అభివృద్ధి | ... |
| 34. మొక్కజొన్న పరిశోధన స్థానము కరీంనగర్. | మొక్కజొన్న | ... |



*నాగార్జునసాగర్ వద్ద కృష్ణానది.*

# పావన కృష్ణానది

— శ్రీ పెద్దిభొట్ల వీరయ్య

నా తండ్రిగారు తాను కృష్ణా, గోదావరి నదుల ఉత్పత్తి స్థానములను కాలి నడకను ప్రయాణముచేసి అచ్చటచ్చట మజిలీలలో నాగుచు వెళ్ళి చూచిన వివరములను నేను 5సంవత్సరముల వాడనుగానుండగా రాత్రులందు కథలుగా చెప్పుచుండెడివారు. దీనికితోడు నా మాతామహుని తోబుట్టువు విజయవాడలో నుండి తాను బ్రహ్మకపాలంకు నడచి వెళ్ళినటుల, గంగోత్రి, హిమోత్రి నదులను చూచినటుల నచ్చట శిలానదిలో వ్రేలు ఉంచిన రాయి యయ్యెడిదని చెప్పి నాకు ఆశ్చర్యము కలిగించెను. తదాది దేశయాత్ర యందు నాకు కుతూహల మేర్పడెను. బాల్యమున విజయవాడలో కృష్ణా తీరమున నా 16 వ సంవత్సరము వరకు నుంటిని. 1885 పుష్కరము నాటికి పది సంవత్సరముల వాడను. అప్పుడు రైళ్ళు లేవు. అయినప్పటికి ఆ పుష్కరమున కనేక వేల జనులు నడచి బండ్లమీద దూరప్రాంత

ములనుండి నిచ్చటకు వచ్చి తీర్థవిధులను నెరవేర్చుకొనిరి. కృష్ణా పుష్కరము 12 సంవత్సరముల కొకసారి బృహస్పతి కన్యారాశిలో ప్రవేశించునప్పుడు వచ్చును. కృష్ణానది పశ్చిమ కనుమలలో పూనాపట్టణమునకు 90 మైళ్ళు పడమరగా మహాబలేశ్వరం పర్వతములో చిన్న సెలయేరుగా ప్రారంభమై క్రమముగా అనేక ఉపనదులందులో కలియగా కృష్ణాజిల్లా పులిగడ్డవద్ద రెండుపాయిలై ఒకటి అవనిగడ్డకు ఉత్తరంగా ప్రవహించి హంసల దీవివద్ద సముద్రములో కలియును. రెండవపాయ అవనిగడ్డకు దక్షిణంగా కోనప్రాంతములో సముద్రమ్ములో చేరును. 1864 లో బందరు ఉప్పెన వచ్చెను, ఈపాయ మెరకవేసి సాగర సంగమము చేరుటకు వీలులేని కయ్యలుమడ అడవిగా మారినది. హంసలదీవివద్దనే కృష్ణాసాగర సంగమ ప్రదేశమునకు యాత్రికులు వెళ్ళుచుందురు. కృష్ణానది శ్రీశైల ప్రాంతమునుండి ఉత్తర వాహినియై, ముక్త్యాల దగ్గర భారద్వాజాశ్రమము నుంచి తూర్పు వాహినియగు చున్నది. సముద్రమునుంచి పడమరకు రాగా నదికి ఉత్తర పటమున మోర్తోట, కొల్లూరు, సీతానగరం, వైకుంఠపురం, అమరావతి ముఖ్యమైన యాత్రాస్థలములు. కృష్ణకు దక్షిణతటమున కళ్ళేపల్లి, మోపిదీవి, ఐలూరు, విజయవాడ, వేదాద్రి, ముక్త్యాల ముఖ్యమైన యాత్రాస్థలములు. సామాన్యముగా పూర్వాచార పరులు గ్రహణ కాలములందునూ ఇతర పర్వదినములందునూ పై ముఖ్య యాత్రాస్థలములకు వెళ్ళుచుందురు. దూరము వెళ్ళలేనివారు నది ఒడ్డుననున్న పల్లెలకు చుట్టుపట్ల ఊళ్ళనుంచి వచ్చి అచ్చట స్నానముచేయుదురు. పుష్కరకాలమందు పై అన్నిక్షేత్రములంటె కాలువల,



కృష్ణానది రోడ్డు వంతెన



నాగార్జునకొండవద్ద కృష్ణానది

రైళ్ళ, మోటార్ల సౌకర్యము గలిగిన కూడలి ప్రదేశమగు విజయవాడకు కొన్ని లక్షల యాత్రీకులు వచ్చుచుందురు అటులనే హంసలదీవికిని హెచ్చుగా యాత్రీకులు వెళ్ళు చుందురు గుంటూరుజిల్లా యాత్రీకులు ఎక్కువగా అమరావతికి చేరుదురు. పంచాంగములలో కొన్ని సౌరసిద్ధాంతము ననుసరించునవి కొన్ని దృక్సిద్ధాంతము ననుసరించునవి గలవు. బృహస్పతి కన్యారాశిలో ప్రవేశించు దినము రెండు సిద్ధాంతములలో వేరువేరుగ నుండుటచేత ఉభయ సిద్ధాంతముల ననుసరించువారికి వీలుగా నుండునటుల విజయవాడ మునిసిపాలిటీవారు పుష్కరమున కేర్పాట్లు చేయుచున్నారు. అప్పుడే వర్షములు ప్రారంభమై కృష్ణకు బురదనీరు వచ్చు రోజులు స్నానఘట్టములందు చేరు వేలకొలది యాత్రీకులను చూచుటకై పూర్వాచార పరులుగానివారును మరికొన్ని వేలు చేరుచుందురు. కొన్ని సంవత్సరములకు పూర్వము అనగా విజయవాడవద్ద ఆనకట్ట కట్టుటకు పూర్వము కృష్ణ నుంచి ఒకపాయ ఆనకట్ట కెగువగా దక్షిణముగా ప్రవహించి నిజాంపట్నం ప్రాంతమున సముద్రనము కలిసెడిది. విజయవాడకు పడమరనున్న ఇబ్రాహింపట్నం నుంచి ఒక పాయ బెజవాడ కొండనుచుట్టి తూర్పుగావచ్చి తిరిగి కృష్ణలో కలిసెడిది ఇప్పుడా పాయలులేవు. ఆనకట్టకు పూర్వము బౌద్ధయుగంలో అమరావతి ఆంధ్రదేశమునకు ముఖ్య పట్నంగా నున్న కాలమున సముద్రమునుండి ఓడలు అమరామతి వరకు వచ్చుచుండినటుల చరిత్రవల్ల తెలియుచున్నది. ఇబ్రహీం పట్టణమునకు ఉత్తరంగానున్న దండకారణ్యమునుండి కలప ఇబ్రాహింపట్టణ రేవునుంచి ఓడల కెగుమతియయ్యేడిది. గుంటూరుజిల్లా నుండి ఖనిజములు అమరావతినుంచి ఓడల కెగుమతి యయ్యేడివి.

నా బాల్యములోని యాత్రాస్థలములను చూడవలెనను కోరిక ననుసరించి ఆసేతు హిమాచల పర్యంతం చాల ముఖ్య పుణ్యక్షేత్రములకు నదులకు సకుటుంబముగవెళ్ళి యాత్రజేసి యుంటిని నేను రైల్వేలకు ప్లీడరుగా బెజవాడలో నుండిన కారణమున యాత్రాస్థలముల వివరములను కొంత

వరకు ఇతర రైల్వేగైడుల నుండి తెలిసికొని నేను స్వయముగా చూచిన సంగతులను చేర్చి పుణ్యక్షేత్రములు అను పుస్తకమును రైల్వే టైముటేబిల్సు వివరమును చేర్చి 1926 లో ప్రచురించినాను. అప్పటి గోదావరి జిల్లా వాస్తవ్యులు నా పుస్తకమును చూచి నావల్ల మరికొన్ని వివరములను తెలిసికొని యాత్రా స్పెషల్సు నేర్పాటుచేయ ప్రారంభించిరి. అంతకుముం దట్టివి లేవు. ఆ పుస్తకములో ఇతర నదులతోపాటు కృష్ణానది యొక్క మార్గమును పటములో కనపరచియుంటిని. శృంగేరీకి పోవు మార్గములో వర్షాకాలమప్పుడే ప్రారంభంకాగా రెండు పిల్లకాలువలు ఒకటి దక్షిణం నుంచి ఒకటి ఉత్తరంనుంచి యొకచోట కలియుట చూచినాను. అందులో ఒకటి తుంగ ఒకటి భద్రి. ఈ రెండు కలిసి తుంగభద్రయై హంపీ విరూపాక్షముల క్రిందగా కర్నూలు దాటి శ్రీశైల ప్రాంతమున కృష్ణలో కలిసిన ఉపనదియై యున్నది. పూనానుంచి మోటారుమీద మహాబళేశ్వరం చేరుటకు ప్రయత్నించగా నాడు వేసవియెండ దుర్భరమై ప్రయాణము సాగలేదు. నాసికాత్రయంబకం వద్ద గోదావరి యొక్క ఉత్పత్తిస్థానమును మాత్రం చూడగలిగితిని ఒక నంది నోటినుంచి ప్రవహించిన పిల్లకాలవ తుదకు పెద్ద నదియగుచున్నది.

పుష్కరమున్న నదులు 12. ఈ నదుల ఒడ్డునయున్న ముఖ్య క్షేత్రములలో కనీస మొక దేవాలయం యాత్రికుల కుపయోగించు నొక సత్రముగలవు. విజయవాడలో అనేక దేవాలయములు అనేక సత్రములు గలవు. పశ్చిమ కనుమల నుండి ప్రవహించు కృష్ణలో షోలాపూరు దాటిన తర్వాత కౌశిక, భీమ అనే ఉపనదులు కలియును. చంద్రభాగ భీమలో కలియును. భాగీరధి మలాపహారానికి - మొదలగు ఉపనదులు మహారాష్ట్రదేశమున కృష్ణలో కలియును. వీని తర్వాత కృష్ణలో కలియు వేణికి ప్రాధాన్యము కలదు. అచ్చట నుండి కృష్ణను కృష్ణవేణియందురు తిరిగి తుంగభద్రకు ముందు విశాల విజయ, వైష్ణవి. నారాయణి అను ఉపనదులు కృష్ణలో కలియును. ముక్త్యాల, వేదాద్రి మధ్య పాలేరు కృష్ణలో కలియును. మూసి నదికూడ వాడపల్లివద్ద కృష్ణలోకలియును. నందిగామసమీపమున మునేరు, బెజవాడ దగ్గర బుడమేరు దిగువున నాగులేరు, గురిదేరు మొదలగు చిన్ననదుల జలము కొంత కృష్ణకుచేరుచున్నది. తుంగభద్ర కృష్ణకు ఉపనదియైనను తుంగభద్రకును పుష్కరముగలదు

మతమునకు పుట్టినిల్లగు హిందూదేశమున పూర్వాచారములకు, పుణ్యక్షేత్రములకు తీర్థస్నానములకు ప్రఖ్యాతి గలదు. ఇప్పుడు ప్రజలలో మత విశ్వాసము సన్నగిల్లి పాపభీతి తగ్గినది. కృష్ణానదిని గురించి కొన్ని గాథలు కలవు. బెజవాడ సీతానగరం కొండలు పూర్వము కలిసియుండెడివని ఆనకట్ట ప్రదేశమందలి కొండ కృష్ణతూర్పునకు యనమలకుదురు వరకు నెట్టివేసి సముద్రమునకు దారి చేసికొనెనను గాథ యొకటి గలదు. కృష్ణానది మహాబళేశ్వరం కొండనుంచి హంసలదీవి వరకు మైళ్ళ పొడవుగలదు. కృష్ణ మిక్కిలి వెడల్పుగానున్న చోట్ల పెద్ద లంకలు గలవు. వానికి గ్రామములుకూడ గలవు. విజయవాడవద్ద కృష్ణమీద కలకత్తా చెన్నపట్నం రైలుమార్గమునకు వంతెన ఏర్పడియున్నది. ఇప్పుడు ఆనకట్ట కెగువను రోడ్డు బారేజి వంతెన ఏర్పడుచున్నది. వానిమీద మోటార్లు వెళ్ళవచ్చును. కృష్ణానది యొక్క జలము తియ్యనిదై పానయోగ్యమై ఆరోగ్యకరమైనది. కృష్ణానదీ జలములవల్లను ఒండు మట్టివల్లను డెల్టా ప్రదేశము మిక్కిలి ఫలవంతమై కృష్ణా గుంటూరు జిల్లా ధాన్యము సమృద్ధిగా గలిగి మిగులు ధాన్యము నితర జిల్లాలకు రవాణా చేయు స్థితిలో నున్నవి.

ఇంతవరకు నాకు తెలిసినంతవరకు కృష్ణానది గురించిన సంగతులను వ్రాసినాను. కృష్ణ కప్పుడప్పుడు హెచ్చు వరదలు వచ్చి పశువులకు, మనుష్యులకు పంటలకు చాల నష్టము కలుగుచుండెను. ఇప్పుడు జరుగుచున్న అభివృద్ధి పనులవల్ల నికముందువరదల యెద్దడి తగ్గవచ్చునని తలంచవచ్చును. కృష్ణా నది యొక్క వెడల్పు ముక్త్యాల ప్రాంతమున ఒక పెద్ద కాల్వంతయై అపారమైన లోతుగలిగి మొసళ్ళతో నిండియుండును. మిక్కిలి వెడల్పుగల చోట రెండు మైళ్ళ వెడల్పుండును. వేసవిలో కొన్నిచోట్ల కృష్ణ కాలినడకను ప్రజలకు దాటవీలగును. విజయవాడకు దిగువను పాతూరు రేవునుంచి విజయవాడ వైపునకు జనులట్లు నదిలో నడచి వేసవిలో చేరుచుందురు

శ్లో. కృష్ణవేణి నమస్తుభ్యం సర్వపాప ప్రణాశిని
త్రిలోకీ పావనజలే రంగత్తుంగ తరంగిణి.

శ్లో విష్ణుదేహాత్ సముత్పన్నే శ్రీశైలోత్సంగగామిని
కృష్ణవేణీతి విఖ్యాతే మమ పాపం వ్యపోహతు

శ్లో. శుద్ధ స్ఫటికసంకాశాం ద్విభుజాం పద్మధారిణీం
శివమూర్తిధరాందేవీం కృష్ణాం త్వాం ప్రణతోస్మ్యహం.

శ్లో. కమండలుధరాం దేవీం జపమాలాధరాం శుభాం
బ్రాహ్మీంసువర్ణవర్ణాభాంకృష్ణాం త్వాం ప్రణతోస్మ్యహం

శ్లో. సర్వదేవమయీం సాక్షాత్ బ్రహ్మవిష్ణు శివాత్మికాం
ఫలదాం సర్వతీర్థానాం కృష్ణాం త్వాం ప్రణతోస్మ్యహం



గంగినేని
కొండపల్లి
విజయవాడ
నూజివీడు
వీరవల్లి
వెదురుపావులూరు
గన్నవరం
తేన్నేరు
ఇందుపల్లి
గుడివాడ
కైకలూరు
పల్లెవాడ
వింజరము
పుట్లచెరువు
మోటూరు
అంగలూరు
పినంపూడి
చవెంద్ర
వడ్లమన్నాడు
పెదన
చిలకలపూడి
మచిలీపట్నం
రైలుమార్గములు నిలయతావులు (బ్రాడ్‌గేజ్)
రైలుమార్గములు, నిలయతావులు (మీటర్‌గేజ్)
జిల్లాసరిహద్దులు.
నది, కాలువ, వంతెన, ఆనకట్టు



మంగళగిరి దేవాలయ గోపురము.

# పుష్కర మాహాత్మ్యము



పుష్కరమంటే పన్నెండేండ్ల కాలమని వాడుకగా చెప్పుకుంటున్నాము. కాని ఆ పదానికి ఆ అర్థంకాదు. పుష్కర శబ్దానికి సంస్కృతవాఙ్మయంలో ఆకాశం, జలం, ఏనుగు తొండంయొక్క చివరిభాగం, ఒక ద్వీపం, ఒక తీర్థం అని ఈలాటి అర్థాలు ఎన్నో వున్నవి. మనకు వాడుకలోవున్న పన్నెండేండ్ల కాలమనే అర్థం పుష్కరతీర్థం అనే అర్థాన్నిబట్టి వచ్చింది.

పుష్కరతీర్థం అంటే ఒక పుణ్యతీర్థం. దీనినిగూర్చి పురాణాలలో ఒక చిన్న వివరణం వుంది. బ్రహ్మ దేవేంద్రుని కోరికపై ఈ పుష్కరతీర్థాన్ని సృష్టించాడట త్రిలోకాలలోని పుణ్యతీర్థాలన్నింటిలోను ఈ పుష్కరతీర్థం అత్యంత పావనమూ, పుణ్యతమమూ అయిందట కనుక ఈ తీర్థానికి తీర్థరాజు అని పేరు వచ్చింది భరత ఖండంలో మిక్కిలి ప్రసిద్ధములైన జీవనదులు పన్నెండు వున్నవి తీర్థరాజైన పుష్కరతీర్థం ఒక్కొక్క సంవత్సరం ఒక్కొక్క జీవనదిలో కలిసి దానిలో తన పవిత్రత్వం, పుణ్యప్రదత్వం, పరిశుభ్రత, ప్రసన్నత ప్రభావము మొదలైన అమోఘశక్తులన్నింటినీ సంక్రమింపజేసి దాన్ని



శ్రీ విజయవాడనగరానికి అభిముఖముగా శ్రీ కనకదుర్గ దేవాలయము

పరమపావనం చేస్తూ వుంటుందట. ఆ కారణంచేత పుష్కరతీర్థం జీవనదిలో కలిసినకాలంలో ఆ జీవనది అసలు పుష్కరతీర్థంవలె మిక్కిలి పావనమై పుణ్యప్రదమై వుంటుందని పురాణ ప్రసిద్ధమైన అంశము. ఈ పుష్కర తీర్థరాజు ఒకసారి ఒక జీవనదికి వచ్చిన తరువాత తిరిగి ఆ జీవనదికే అది వచ్చుటకు పన్నెండు సంవత్సరాలకాలం పట్టుతుంది. కాబట్టి మనవారు సాధారణంగా పన్నెండు సంవత్సరాల కాలానికి పుష్కరమని వాడుతున్నారు.

పుష్కరతీర్థం ఆకాశగంగయందుండే ఒక మడుగు. అది సమస్త ప్రపంచానికి ఉపకారం చేసే లాగు వుండే నిమిత్తమై సర్వప్రపంచ సృష్టికర్తయైన బ్రహ్మదేవుడు, వివిధ ఖండాలలోవున్న ప్రసిద్ధ జీవనదులలో కలుసుకొని భూలోకంలో ప్రవహించవలసిందిగా పుష్కరతీర్థాన్ని ఆదేశించాడు. కనుక ఏ సంవత్సరం ఏ నదిలో పుష్కరతీర్థం ప్రవహించునో ఆ కాలంలో ఆ నదిలో ప్రపంచంలోని సర్వతీర్థాలు, ముప్పదిమూడుకోట్ల దేవతలందరు తమతమ పవిత్ర పుణ్యశక్తులను అన్నిటిని ఆ ప్రవాహంలో సంక్రమింపజేయవలసిందనికూడా బ్రహ్మదేవుడు వారి నందరినీ ఆదేశించినాడు.

పుష్కరమంటే మరియొక వివరణకూడా పురాణాలలో కలదు - శివుడికి ఎనిమిది మూర్తులు వున్నాయి. అందులో జలరూపమైన మూర్తికూడా ఒకటి. బ్రహ్మదేవుడు ప్రపంచాన్ని సృష్టి చేయదలచుకొని భగవంతుడైన పరమేశ్వరుని యొక్క జల



అమరావతిలో కృష్ణానది తీరాన వెలసియున్న అమరలింగేశ్వరస్వామి దేవాలయం.



కృష్ణాజిల్లాలోని శ్రీకాకుళం దేవాలయం.

మూర్తిని తనకు సహాయము చేయవలసిందిగా ప్రార్థించినాడు. పరమ శివుడు వెంటనే ఆ ప్రార్థనను అంగీకరించి బ్రహ్మకు సహాయము చేసినాడు. శివుని యొక్క జలమూర్తికే పుష్కరమని పేరు. సంస్కృతంలో పుష్కరమంటే జలమని కూడా అర్థంవుంది.

గురువు పన్నెండు రాసులలో సంచరించునప్పుడు క్రమంగా పన్నెండు నదులలో పుష్కరం వస్తుంది. గురువు మేషంలో వున్నప్పుడు గంగకు, వృషభంలో వున్నప్పుడు రేవానదికీ, మిధునంలో వున్నప్పుడు సర్వస్వతీనదికి, కర్కాటకంలో వున్నప్పుడు యమునకు, సింహంలో వున్నప్పుడు గోదావరికి, కన్యారాశిలో వున్నప్పుడు కృష్ణానదికి, తులలో వున్నప్పుడు కావేరికి, వృశ్చికరాశిలో వున్నప్పుడు భీమరథీ నదికి, ధనుస్సులో వున్నప్పుడు తామ్రపర్ణి నదికి, మకరంలో వున్నప్పుడు తుంగభద్రానదికి, కుంభంలో వున్నప్పుడు సింధునదికి, మీనంలో వున్నప్పుడు తపతి నదికి, పుష్కరం ప్రవేశిస్తుందని పురాణ ప్రమాణాలు వున్నవి.

ఈ విధంగా ఆయా రాసులలో గురువు ప్రవేశించినప్పుడు ఆ యా జీవనదులకు పుష్కరం వస్తుంది. ఈ పుష్కర పుణ్యకాలం ఆరంభించిన నాటినుండి పన్నెండు రోజులవరకూ వుంటుంది.

ఈసంవత్సరం జ్యేష్ఠబహుళ సప్తమి 19-6-57 తేదీన గురువు కన్యారాశిలో ప్రవేశిస్తున్నాడు కాబట్టి ఆనాడు పుష్కరం కృష్ణానదికివస్తున్నది. పన్నెండేండ్ల క్రిందట కృష్ణాపుష్కరం 1945 జులై లోవచ్చింది.

దీనికి ఒకగాధ కలదు. బృహస్పతి తాను ఎప్పుడు ఏ నదిలో వుంటాడో అప్పుడు ఆ నదీజలాలను పావనం చేయవలసిందిగా బ్రహ్మను పుష్కరమును కోరినాడు. అప్పుడు బ్రహ్మదేవుడు తనయొక్కయు, పుష్కరం యొక్కయు ప్రభావాన్ని మాత్రమేగాక 33 కోట్ల దేవతల ప్రభావాన్ని కూడా భూలోకానికి పుష్కరకాలంలో తేవడానికి అంగీకరించాడు. ఈవిధంగా గురువు వివిధ రాసులలో ప్రవేశించిన తరువాత 12 దినాలవరకు ఆయా నదుల జలాలు బ్రహ్మ, పుష్కర, బృహస్పతులు, సమస్తదేవతల యొక్క సమష్టి ప్రభావంవల్ల మిక్కిలి మహిమోపేతంగా అవుతాయి. ఆపన్నెండు దినాల తరువాత కూడా ఆ సంవత్సరంలో దైవికమైన ప్రభావం వుంటూనే వుంటుంది కాని ఆ సంవత్సరమంతా మధ్యాహ్నంపూట మాత్రం కొన్ని నిమిషాలపాటు ఆ ప్రభావం వుండదని పురాణాలలో చెప్పబడింది. కాబట్టి భారతదేశంలో పన్నెండేండ్లకొకసారి ప్రతి జీవనదికి గురువు ఆయా రాశిలో ప్రవేశించిన తొలి పన్నెండు దినాలవరకు పుష్కరోత్సవం జరుపబడుతున్నది. పుష్కరం ప్రవేశించిన నదీతీరాలలో లక్షల కొలది యాత్రికులు ప్రతి సంవత్సరం ఆయా నదులలో, స్నానంచేసి తమ పాపాలు క్షాళితం చేసుకొని దేవతల ప్రభావంతో తమ జీవితాలను ధన్యతమంగా చేసుకొని పవిత్రులవుతారు. పుష్కర కాలంలో పితృతర్పణం మొదలైన వైదిక కర్మలు కూడా నిర్వర్తిస్తూ వుంటారు.

గురువు ఏదైనారాశిలో ప్రవేశించినప్పుడు ఏనదికి పుష్కరం వచ్చునో దానికి సూర్యుడు అనేక జీవ శక్తులను కలుగజేస్తాడు. అట్టినదిలో స్నానం చేసిన వారికి కొత్త జీవశక్తులు సంక్రమిస్తాయి. మానవ శరీరానికి కావలసిన నూత్న జీవశక్తులన్నీ ఆ నదీ జలాలలో వుంటాయి. ఈవిధంగా పన్నెండునదులలో స్నానం చేయడంవల్ల పన్నెండు విధములయిన జీవ శక్తులు ప్రాప్తమై శరీరదార్ఢ్యము కలిగి ఆయుః ప్రమాణాన్ని హెచ్చిస్తాయి. అట్టి స్నానంవల్లను, అప్పుడు నదిలో వీచే గాలిని పీల్చడంవల్లను ఆయుస్సు పెరుగుతుంది. కనుక పన్నెండు నదులలోను ఒక్కొక్క దానిలో పుష్కరకాలంలో పన్నెండు రోజుల చొప్పున మొత్తం 144 రోజులు స్నానం చేసినవారికి జవసత్వములు దీర్ఘాయుస్సు కలుగుతవి.

గంగానదిలో సంవత్సరమంతా జీవశక్తివుంటుంది. ఆ జీవశక్తి ఇతర నదులలో పుష్కరకాలం 12 రోజులు మాత్రమే వుంటుంది. ఈ విషయాన్ని అత్యంత నిపుణులయిన అమెరికాదేశ విజ్ఞాన శాస్త్రజ్ఞులుకూడా పరిశోధించి నిజమని అంగీకరించారు. ఈ విషయం ఆ దేశపు విజ్ఞానశాస్త్ర పత్రికలలో కూడా ప్రకటింపబడింది. కాబట్టి పుష్కరకాలంలో ఈ నదులలో స్నానంచేసి, పవిత్రమైన పితృకర్మలను ఆచరించి తద్వారా తమ వంశాభివృద్ధిని, పితృదేవతలకు మోక్షమును ప్రతివారూ కలుగజేసుకుంటారు. ఈ ఉద్దేశంతోనే మహోదయ పర్వంలో ఋషులు సముద్రస్నానంచేసి తమ భౌతిక శరీరానికి జీవశక్తిని

[తరువాయి 60 వ పేజీలో]

# ఆంధ్రప్రదేశ్‌లో ప్రజారోగ్య పథకాలు

భారతదేశంలోని ఇతర ప్రాంతాలలో వలెనే ఆంధ్ర ప్రదేశ్‌లో కూడా ఆరోగ్యస్థాయి చాలా తక్కువగా వుంది. ఇందుకు కారణం పరిసరాలు పరిశుభ్రంగా లేకపోవడం; అంటువ్యాధులు విస్తారంగా వ్యాప్తిలో వుండడం; వ్యాధి నిరోధ, నివారణకు తగినన్ని సౌకర్యాలు లేకపోవడం ప్రజలలో అత్యధికసంఖ్యాకుల పౌష్టికాహార ప్రమాణాలు మరీ తక్కువగా వుండడం.

ఈ పరిస్థితులలో, జాతి సౌభాగ్యాన్ని కుద్దేశించబడిన పంచవర్ష ప్రణాళికలు దేశవ్యాప్తమైన ఆరోగ్య పథకాలకి మిక్కిలి ప్రాధాన్యత ఇస్తున్నాయి. అవి మారుమూలల గ్రామాలకి కూడా ఉపకరించగలవు. ఆ ప్రకారం అత్యంత ప్రధానమైన ప్రజారోగ్య సమస్య పరిష్కారానికై తొలి, ద్వితీయ ప్రణాళికల క్రింద రాష్ట్రప్రభుత్వం చాలా శ్రద్ధతో పని జరిపిస్తున్నది.

## హెల్తు విజిటర్లకు శిక్షణ

ఆరోగ్య పథకాలు వేగంగా అమలుజరగడానికి సుశిక్షితులై మంచి సాధన సంపత్తి గలిగి వ్యాధిగ్రస్తులకు సేవ చేయడంలో నేర్పు గలిగిన హెల్తు విజిటర్లు అవసరం. అందుచేత సంవత్సరానికి 12 మందికి శిక్షణ యివ్వడానికై ఆంధ్రలో 1954 డిసెంబరులో ఒక పాఠశాల తెరువబడింది. దీనిలో చేరేవారు అడ్డే లేనందున 2½ సంవత్సరాల యేకీకృతమైన కోర్సు ఒకటి ద్వితీయ ప్రణాళిక కాలంలో ఆరంభించబడింది. దీనిలో యేటా 52 మందికి శిక్షణ యివ్వబడుతుంది.

## సింహాచలం ఆరోగ్య కేంద్రం

శానిటరీ ఇనస్పెక్టర్లు, దాయాలు, నర్సుల తీవ్ర శిక్షణ పథకాల పట్ల కూడా తగినంత శ్రద్ధ చూపబడింది. విశాఖపట్నం ఆంధ్ర వైద్య కళాశాల యొక్క సాంఘిక, వ్యాధి నిరోధ వైద్యశాఖలో ఒక భాగంగా యేర్పరచిన సింహాచలం ఆరోగ్య కేంద్రాన్ని గ్రామీణ ఆరోగ్య కేంద్రంగా అభివృద్ధి చేశారు. ఇది యితరపనులతోపాటు శానిటరీ ఇనస్పెక్టర్లకి శిక్షణనిస్తుంది. యునిసెఫ్ సహాయంతో సంవత్సరానికి యించుమించు 360 మంది దాయాలకు శిక్షణ ఇవ్వబడుతున్నది.

## కలకత్తాలో నర్సుల శిక్షణ

తొలిప్రణాళిక కాలంలో హైదరాబాదు, సికింద్రాబాదుల లోను, నిజామాబాద్, వరంగల్లులలోను దాయాల శిక్షణకై శిక్షణకేంద్రాలు నెలకొల్పబడ్డాయి. ఆ తరువాత శిక్షణ పొందేవారికి వసతిగృహ సౌకర్యాలు కూడా కల్పించబడినవి. ద్వితీయ ప్రణాళిక ఆరంభముతో ఆరోగ్యపథకాలు వుద్ధృతంగా కొనసాగాయి. మంత్రసానులు, శానిటరీ ఇనస్పెక్టర్ల తీవ్రశిక్షణ పథకం శాశ్వత ప్రాతిపదికపై చేపట్టబడింది. కలకత్తాలోని అఖిలభారత పరిశుభ్రత, ప్రజారోగ్య సంస్థలో నర్సులకు శిక్షణ యిచ్చే పథకం ఒకటి వుంది. ఇక్కడ యేటా యిద్దరికి శిక్షణ యివ్వబడుతుంది.

## బి. సి. జి. టీకాలు

విజ్ఞానశాస్త్రం యెంత పురోగమించినా క్షయవ్యాధి మానవజాతికి ప్రబలశత్రువుగానే వున్నది. ముఖ్యంగా పూర్తిగా అభివృద్ధి చెందని భారతదేశంలో దానిసంభవాలు విపరీతంగా హెచ్చుగా వున్నాయి. దేశవ్యాప్తమైన బి.సి.జి. టీకాల వుద్యమం భయంకరమైన యీ వ్యాధి నెదుర్కొనడానికి కొంగ్రొత్త సాధనంగా పరిగణింప బడుతున్నది. తొలిప్రణాళిక సమాప్తినాటికి పూర్వపు ఆంధ్రరాష్ట్రంలో దాదాపు 1,80,000 మంది పరీక్షించబడ్డారు. 6.23 లక్షల మందికి టీకాలు వేయబడ్డాయి. మిగిలిన ప్రాంతములో ద్వితీయ ప్రణాళికకాలంలో పని జరుపబడుతుంది. ఇప్పుడు యీ పథకం తెలంగాణా ప్రాంతంలో కూడా అమలు జరుగుతుంది.

## మలేరియా నివారణ కార్యక్రమం

మలేరియా నివారణకై ఒక పథకాన్ననుసరించి పని జరుగుతున్నది. ఇది రాష్ట్ర ఆరోగ్య పథకాలలోని విశేషం. తొలిప్రణాళిక మొదటి సంవత్సరంలో యీ వ్యాధి ప్రబలంగా వుండేప్రాంతాలకి ప్రాధాన్యత యివ్వబడింది. వరంగల్లు జిల్లా లక్నవరంలో ఒక మలేరియా నివారణయూనిట్టు యేర్పాటు చేయబడింది. ప్రస్తుతం తెలంగాణా ప్రాంతంలో పనిచేస్తున్న 3 మలేరియా నివారణ యూనిట్లకు పరికరాలను సమకూర్చడానికి ద్వితీయప్రణాళికలో విస్తారమైన వసతి కల్పించబడింది. పూర్వపు ఆంధ్ర రాష్ట్రంలో 40 లక్షల మంది ప్రజలకు వుపకరించే 4 మలేరియా నివారణయూనిట్ల యేర్పాటు పూర్తయింది. వీటికితోడు మరి రెండు యూనిట్లను యేర్పాటు చేయాలని సంకల్పం. కేంద్ర మలేరియా లేబొరేటరీ, ప్యూజియాల యేర్పాటుకి కూడా పథకం తయారుచేయబడింది. లేబొరేటరీలో శిక్షణకి, పరిశోధనకి సౌకర్యాలు వుంటాయి.

అమలు జరుగుతున్న 34 మలేరియా నివారణ పథకాలలోను 16 ఏజన్సీ ప్రాంతాలలో అమలు జరుగుతున్నాయి, డి.డి. టి. చల్లే పరికరాలు, రవాణా సౌకర్యాలు జాతీయ మలేరియా నివారణ కార్యక్రమం క్రింద వుచితంగా లభించాయి.

## బోదవ్యాధి నివారణ

రాష్ట్రంలో బోదవ్యాధి వ్యాప్తిలో వుంది. నిజామాబాదు మహబూబునగరం, మెదక్, కరీంనగరం జిల్లాల్లో దీని వునికి నట్టయిన ప్రాంతాలలో నివారణ కార్యక్రమాన్ని తీవ్రతరం చేయడానికై జాతీయ బోదవ్యాధి నివారణ కార్యక్రమం క్రింద ద్వితీయ ప్రణాళిక కాలంలో 3 నివారణ యూనిట్లను యేర్పాటు చేయాలని సంకల్పం. పూర్వపు ఆంధ్ర రాష్ట్రంలో తొలిప్రణాళికక్రింద 1955 లో 2 సర్వే యూనిట్లు నెలకొల్పబడినవి. ప్రణాళిక సమాప్తి నాటికి యివి బాగా పురోగమించాయి.

## ఆరోగ్యయూనిట్లు, మందుల పెట్టెలు

ఆస్పత్రుల సంఖ్య యిటీవల జనసంఖ్య విపరీతంగా పెరిగిపోవడం వల్ల హెచ్చే అవసరాలకి తగినంతగా లేదు. తెలంగాణా ప్రాంతములో తొలిప్రణాళికకాలంలో 18వైద్య



*శ్రీ బెజవాడ గోపాలరెడ్డిగారు హైద్రాబాదులోని సంరక్షణగృహ వార్షికోత్సవ సందర్భంలో గెలుపొందినవారికి బహుమతులు పంచిపెడుతున్న దృశ్యం*



సాంస్కృతిక ప్రదర్శనంలో ప్రదర్శించబడిన నృత్యం

ఆరోగ్య యూనిట్లు నెలకొల్పబడ్డాయి. ద్వితీయ ప్రణాళిక కాలంలో మరి 10 యూనిట్లు మంజూరు చేయబడ్డాయి, ఈ యూనిట్లు ప్రసూతి, శిశు సంరక్షణ, కుటుంబనియంత్రణం తత్సంబంధమైన విషయాలలో ప్రధానంగా వుపకరిస్తాయి. ఆస్పత్రిలో వుండి చికిత్సపొందేవారికి యెక్కువ సౌకర్యాలను సమకూర్చడానికై హైదరాబాదు ఫీవర్ ఆస్పత్రి అభివృద్ధి చేయబడుతుంది. ఇందుకై ద్వితీయ ప్రణాళికలో రూ. 25,000 కేటాయించబడినవి.

ప్రతి సమాజాభివృద్ధి బ్లాకులోను ఒకప్రాథమిక ఆరోగ్య కేంద్రం పనిచేస్తున్నది. ఒక్కొక్కదానిలో ఒక వైద్యాధికారి ఒక హెల్తు విజటరు, 4 ప్రసూతి సహాయకులు మరి కొంతసిబ్బంది పనిచేస్తున్నారు. ప్రతిఒక్క కేంద్రము క్రిందికి ఉప కేంద్రాలున్నాయి. ఈ కేంద్రాలు గ్రామీణులకు యేకీకృతమైన వ్యాధి నివారణ నిరోధకసౌకర్యాలు సమకూరుస్తాయి. ఆంధ్ర ప్రాంతములోని13 యుద్ధానంతర పునర్నిర్మాణ ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలు తమ పనిని కొనసాగిస్తున్నాయి. తెలంగాణాలో ప్రతి బ్లాకులోను ఒక హెల్తు ఇనస్పెక్టరు నియమించబడ్డాడు.

తెలంగాణాలో ఆస్పత్రులకు, ఔషధశాలలకు దూరంగ వున్న గ్రామాల వుపయోగానికై 797 గ్రామీణమందుల పెట్టెలువున్నాయి. వీటిలో ప్రథమచికిత్సకి, చిన్నచిన్న బాధలకి అవసరమైన మందులు వుంటాయి. ఇవి వుపాధ్యాయులకు, సంఘసేవకులకు లేక గ్రామపెద్దలకు యివ్వబడుతాయి. పల్లెప్రాంతాలలో వైద్య ప్రజారోగ్య రక్షణకై నాలుగు సంచార వైద్య. ఆరోగ్య యూనిట్లు పనిచేస్తూన్నాయి. ద్వితీయ ప్రణాళిక కాలంలో మందుల పెట్టెలు 100 కి పైగా సప్లయి చేయబడతాయి.

## సుశిక్షితులైన సిబ్బంది

సుశిక్షితమైన సిబ్బంది కొరతను తీర్చడానికై ద్వితీయ ప్రణాళిక క్రింద తీవ్ర శిక్షణ పథకాల అమలు తలపెట్ట బడింది. ఆప్రకారం విదేశాలలో ప్రజారోగ్యంలో వున్నత శిక్షణను పొందడానికై 5 మంది ప్రజారోగ్యశాఖ అసిస్టెంటు డైరెక్టర్లను 5 మంది మొదటి తరగతి ఆరోగ్యాధికార్లను పంపించాలని సంకల్పించబడింది. ఆపైన 30 మంది ఆరోగ్యాధికారులకు ప్రజారోగ్యంలో డిప్లొమా కోర్సులో శిక్షణ యివ్వబడుతుంది. 50 మంది ఆరోగ్యాధికారులకు సంస్కార శిక్షణ యివ్వబడుతుంది. 25 మందికి మలేరియా, పారిశ్రామిక పారిశుద్ధ్యం, కుష్ఠు, క్షయ పౌష్టికాహారాల వంటి ప్రత్యేక విషయాలలో శిక్షణ యివ్వబడుతుంది. 60 మంది నర్సులకు పబ్లిక్ హెల్తు విజిటింగులో శిక్షణ, సంస్కార శిక్షణ యివ్వబడతాయి.

## గుంటూరు శిక్షణాకేంద్రం

గుంటూరు వైద్యకళాశాలలో శానిటరీ ఇనస్పెక్టరు విద్య నభ్యసిస్తున్నవారికి ఫీల్డు శిక్షణాకేంద్రంగా వుపకరించ

డానికి శానిటరీ ఇనస్పెక్టర్ల శిక్షణా పథకం క్రింద గుంటూరు జిల్లాలో ఒక గ్రామీణ ఆరోగ్య కేంద్రం ఆరంభించ బడుతుంది.

ప్రాంతీయ పౌష్టికాహార యూనిటు స్థాపన ద్వారా 1950 లో ఒక పౌష్టికాహార పరిశోధకపథకం ఆరంభించబడింది. విశాఖపట్నం ప్రాంతంలో నంజు వ్యాధి పరిశోధనకై కూడా ఒక పథకం అమలులో వుంది. సంవత్సరాంతంలో యీ పౌష్టికాహార యూనిటు గుంటూరుకు తరలించబడింది. ద్వితీయ పంచవర్షప్రణాళిక కాలంలో రాయలసీమ ప్రాంతానికై అదనంగా మరొక ప్రాంతీయ పౌష్టికాహార యూనిటును నెలకొల్పాలని సంకల్పించబడింది.

ఒక కేంద్ర పౌష్టికాహార లేబొరేటరీ, మ్యూజియము ఆరంభింపబడతాయి. ఈ లేబొరేటరీలో ఆరోగ్య సిబ్బంది శిక్షణకు, పరిశోధనకు సౌకర్యాలు వుంటాయి. ఈ సౌకర్యాలు సమిష్టి మద్రాసు రాష్ట్ర విభజనవల్ల పోయినవి. లేబొరేటరీని 1957-58 లో స్థాపించాలని తలపెట్టబడింది.

## కుష్ఠువ్యాధి కేంద్రం

జహీరాబాదులోని కుష్ఠువ్యాధి పరిశోధన, చికిత్సా కేంద్రానికి తొలి ప్రణాళిక కాలంలో గ్రాంటు యివ్వబడింది.

తెలంగాణాలోని అన్ని ప్రభుత్వ, ఎయిడెడ్ ఆస్పత్రుల లోను, ఔషధ శాలలలోను కుష్ఠు క్లినిక్కులున్నాయి. అవి వారాని కొకరోజు పనిచేస్తాయి. ఆంధ్ర ప్రాంతంలో 17 కుష్ఠు క్లినిక్కులున్నాయి. పూర్వపు ఆంధ్రప్రాంతంలోని అన్ని ప్రభుత్వ, ఎయిడెడ్ ఆస్పత్రులు, ఔషధశాలల్లోను కుష్ఠు క్లినిక్కులను నెలకొల్పడానికి యేర్పాట్లు జరుగుతున్నాయి.

తొలి ప్రణాళికకాలంలో రాష్ట్రంలోని వివిధ జిల్లాల్లోను, హైదరాబాదు నగరంలోను 10 ప్రసూతి, శిశు సంరక్షణ కేంద్రాలు నెలకొల్పబడినవి. ద్వితీయ ప్రణాళికలో వెనుకబడిన ప్రాంతాలలో మరి 6 కేంద్రాలను నెలకొల్పే ప్రతిపాదన వున్నది.

ప్రథమప్రణాళిక కాలంలో పరిసర ఆరోగ్య సంరక్షక బ్యూరో స్థాపించబడింది. అంటు వ్యాధులు, ప్రధాన సంఖ్యల సేకరణబ్యూరో అను సంస్థ అంటువ్యాధుల విషయములోను సంఖ్యల సేకరణ విషయంలోను జనన మరణముల రిజిస్ట్రేషన్ విషయంలోనూ కృషిచేస్తూవుంది.

## గ్రామీణ ఆరోగ్యం

గ్రామీణ పరిసర ఆరోగ్యాన్ని అభివృద్ధి పరచే ఉద్దేశంతో తగు డిజైనులను రూపొందించడానికై ప్రథమ పంచవర్ష ప్రణాళికకాలంలో 1954-55 సంవత్సరంలో కేంద్ర ప్రజారోగ్య ఇంజనీరింగు సంస్థ స్థాపించబడింది. ఈ యూనిటు రెండవ పంచవర్షప్రణాళికలోకూడా పనిచేస్తుంది. ఆహారం కొరతవల్లను, అంటువ్యాధులు ప్రబలడం వల్లను సోకునట్టి వ్యాధులను అరికట్టుటకు నిరోధకచర్యలు గైకొనడానికై ప్రతిజిల్లాకు ఇప్పుడున్నట్టి జీప్‌కారు గాక అదనంగా ఎపిడిమిక్ కంట్రోలు వ్యాన్‌ను ఏర్పాటు జేయుటకై ఈ పథకం తలపెట్టబడింది.

## ఆరోగ్య విద్య

ఆరోగ్యం విషయంలో ప్రజలకు విజ్ఞానం కలిగించడానికై ప్రజారోగ్యశాఖ డైరెక్టర్ కార్యాలయంలో కేంద్ర ఆరోగ్య విద్య (ప్రచార) బ్యూరోను నెలకొల్పవలెనని తలపెట్ట బడింది. ఆ బ్యూరోలో ఒక ఫిలిం లైబ్రరీ వుండగలదు. ప్రజారోగ్యానికి సంబంధించిన కరపత్రాలు మొదలగు సాహిత్యాన్ని పంచిపెట్టేందుకు తగు ఏర్పాట్లు వుంటాయి.

పబ్లిక్ గార్డెన్సులో వున్న హైద్రాబాదు హెల్త్‌మ్యూజియమును చూడడానికి రాష్ట్రంనుంచి, ఇతర రాష్ట్రాలనుంచి అనేకులువస్తున్నారు. మరికొన్ని వస్తువులను, నమూనాలను చేర్చి మ్యూజియమును విస్తరించడమైనది. ప్రతిరోజూ దాదాపు 25000 మంది వ్యక్తులు దీన్ని సందర్శిస్తున్నారు.

తెలంగాణా ప్రాంతంలో 17 కుటుంబ నియంత్రణ కేంద్రాలు, ఒక కుటుంబ సంక్షేమ కేంద్రం పనిచేస్తున్నవి. ఆంధ్రలో కర్నూలులోని కుటుంబ నియంత్రణ కేంద్రాలు యథాప్రకారంగా పనిచేస్తున్నవి.

## ఏజన్సీ ప్రాంతాలకు ఆరోగ్య పథకాలు

ఆంధ్రప్రదేశ్‌లోని ఏజెన్సీప్రాంతాలు ఒరిస్సా మధ్యప్రదేశ్ రాష్ట్రాలను అనుకొని వున్నవి. కొన్నిచోట్ల ఈ ఏజన్సీ ప్రాంతాలు ఆ రాష్ట్రాలలోకి కూడా విస్తరించి వున్నవి. శ్రీకాకుళం, విశాఖపట్నం, తూర్పుగోదావరి, పశ్చిమగోదావరి, కరీంనగర్, వరంగలు, ఖమ్మం, ఆదిలాబాదు జిల్లాలలోని 23 తాలూకాలలో ఏజన్సీప్రాంతాలున్నవి.

ఏజెన్సీ ప్రాంతాలను సక్రమంగా అభివృద్ధి పరచడానికి ఈ క్రింది పథకములు అవసరమని భావింపబడింది.

1. మలేరియా నిరోధక చర్యలు.
2. యాస్ వ్యాధి నిర్మూలన చర్యలు.
3. వ్యక్తిగత ఆరోగ్య సేవల ఏర్పాటు— అంటే ప్రసూతి శిశు ఆరోగ్య సేవలు.
4. పరిశుభ్రమైన మంచినీటి సరఫరా, పరిసరముల పారిశుధ్య అభివృద్ధి.
5. ఆహార కొరత వల్ల వచ్చే జబ్బులకు చికిత్స.

ఈ వ్యాసంలో మొదటి రెండు పథకములను గూర్చి వివరింపబడింది.

ఆంధ్రప్రాంతములోని ఏజన్సీ ప్రాంతాలలో చాలాకాలం నుంచి మలేరియా నిరోధకచర్యలు అమలు జరుగుతున్నవి. ఇందుకై కొన్ని గ్రామాలు మాత్రమే ఎన్నిక చేయబడ్డవి. ఆంధ్రరాష్ట్రం ఏర్పడ్డ తరువాత అంతకు ముందు అమలు జరుగుతున్న 19 మలేరియా నిరోధక పథకాలు గాక క్రొత్తగా మరి 15 పథకాలను ప్రభుత్వం మంజూరుచేసింది. ఈ 34 పథకాలలో మైదాన ప్రాంతాలలోని పథకాలుకూడా చేరి వున్నవి. భారతప్రభుత్వం ఆంధ్రరాష్ట్రానికి రెండు యూనిట్లను కేటాయించింది, ఒక్కొక్క యూనిటు దాదాపు పదిలక్షలమంది ప్రజలకు మలేరియా రాకుండా కాపాడుతుంది. మలేరియా నిరోధక చర్యలద్వారా తూర్పుగోదావరి పశ్చిమగోదావరి జిల్లాలలోని ఏజెన్సీ ప్రాంతాలు కంట్రోలు క్రిందికి తేబడినవి. శ్రీకాకుళం, విశాఖపట్నం జిల్లాలలోని పథకాలు ఏజన్సీ ప్రాంతంలో దాదాపు సగాన్ని అదుపులోకి తెచ్చినవి. ఏజన్సీప్రాంతం మొత్తాన్ని మలేరియా నిరోధక చర్యలక్రిందికి తేవడానికై ప్రభుత్వం అదనంగా మరిరెండు మలేరియా నిరోధక యూనిట్లను మంజూరు చేసింది. వీటన్నిటివల్ల మంచి ఫలితాలు కలిగాయి.

శ్రీకాకుళం, విశాఖపట్నం జిల్లాలలో 1953 లో 93 శతి చొప్పున వున్నప్లై స్ప్లీన్ వ్యాధి రేటు 1955 లో 20 శతికి తగ్గింది. 1943 లో అరకులోయ భూమి కాలనైజేషన్ కొరకు తీసుకోబడిన కొన్నిగ్రామాలలో 1953-54 సంవత్సరంలో స్ప్లీన్ వ్యాధి అసలు సోకనేలేదని తెలియవచ్చింది. సారవంతమైన ఈ లోయను కూడా వ్యవసాయ క్షేత్రాలతో పశువులు, కోళ్ళు, పశులు పట్టుకేంద్రాలతో అభివృద్ధి పరచబడింది. మలేరియానిరోధక పథకాలవల్ల మలేరియా రోగ లక్షణాలు చాలావరకు తగ్గింపబడ్డవి. అనేకవేల ఎకరాల భూమి అక్కడ ఇప్పుడు సాగు అవుతున్నది.

## తెలంగాణాలో మలేరియా నిరోధన

1952లో లక్నవరం చెరువుక్రింద వున్న గ్రామాలలో మలేరియా పరిశీలన జరుపబడింది. దాదాపు 14,952 మంది జనాభా గల 39 గ్రామాలలో మలేరియాను అరికట్టడానికై 1946 లో ఒక పథకం మంజూరు చేయబడింది. మళ్ళీ 1954 లో యావత్తు మలేరియా నిరోధక వ్యవస్థ పునర్విమర్శ చేయబడింది. మలేరియా యూనిట్ ప్రధాన కేంద్రం వరంగలు జిల్లాలో హనుమకొండకు మార్చబడింది. వరంగలు, ఖమ్మం, కరీంనగర్, నిజామాబాదు జిల్లాలలో నాల్గు సబ్‌యూనిట్లు స్థాపించబడ్డవి. ఒక్కొక్క యూనిటుక్రింద రెండు మొదలు మూడు తాలూకాలవరకు ఉంటవి. 1946 లో 6 మొదలుకొని 92 వరకు వున్న స్ప్లీన్ వ్యాధి రేటు 1954 లో 4.6; 10 కి తగ్గింది.

ఆంధ్రప్రదేశ్‌లోని ఏజన్సీ ప్రాంతాలలో యాస్ అనే వ్యాధి వుంది. ఇది అసహ్యామైన వ్యాధి. పశ్చిమ గోదావరి జిల్లాలోని పోలవరం ఏజన్సీలోను, తూర్పు గోదావరి జిల్లాలోని నూగూరు భద్రాచలం ప్రాంతాలలోను, శ్రీకాకుళం జిల్లాలోని సాలూరు, పార్వతీపురం, పాలకొండ ఏజన్సీలలోను ఈ వ్యాధి తీవ్రంగా వున్నట్లు తూర్పుగోదావరి జిల్లాలోని రంపచోడవరంలో ఒకమాదిరిగా వున్నట్లు, విశాఖపట్నం జిల్లాలోని కృష్ణాదేవిపేట, చింటపల్లి ప్రాంతాలలో తక్కువగా వున్నట్లు తెలుస్తున్నది. తెలంగాణాలోని మారుమూలల ప్రాంతాలలో కూడా ఈ వ్యాధి వుంది. ముఖ్యంగా ఖమ్మం, వరంగలు, కరీంనగర్, ఆదిలాబాదు జిల్లాలలో తీవ్రంగా వుంది. ఆంధ్రలో టి. సి. పి. అని వ్యవహరింపబడే యాస్ నిరోధకపథకం 1954 నుంచే అమలులోవుంది. ఏజన్సీ ప్రాంతాలన్నిటిలో యాస్ నిర్మూలన పరిశీలన జరుపబడింది. యాస్ వ్యాధి తగిలినవారికి పామ్ డోస్ ఇవ్వబడింది. శృంగవరపు కోట ఏజన్సీ తప్ప శ్రీకాకుళం, విశాఖపట్నం జిల్లాలలోను, తూర్పు పశ్చిమ గోదావరి జిల్లాలలోను గల యావత్తు ఏజన్సీ ప్రాంతంలో పరిశీలన చికిత్సాదులు పూర్తి అయినవి. నూగూరులో పునః పరిశీలన జరుపబడగలదు.

తెలంగాణాలో ఖమ్మం, వరంగలు, కరీంనగర్ జిల్లాలలోను ఆదిలాబాదు జిల్లాలోని ఆసిఫాబాదు, సిర్పూరు, చెన్నూరు తాలూకాలలోను ప్రాథమిక పరిశీలన పూర్తి చేయబడింది. పోతే ఉట్నూరు, బోథ్ తాలూకాల పరిశీలన

(తరువాయి చివరి పేజీలో)

# అభివృద్ధి బ్లాకులలో జరుగుతున్న కృషి



## షాద్‌నగర్ బ్లాకులో గ్రామశిబిరాల నిర్వహణ

షాద్‌నగర్ సామాజికాభివృద్ధి బ్లాకులో మే 11వ తేదీనుంచి 15వ తేదీ వరకు బూర్గుల, ఉడిత్యాల, బాలానగర్, మొగలిగిద్ద, చించోడి గ్రామాలలో శిబిరాలు నిర్వహింపబడ్డవి. ఉదయం, సాయంత్రం గ్రూపు చర్చలు జరిగాయి. గ్రామస్తులే ముఖ్యంగా చర్చల్లో పాల్గొన్నారు. వ్యవసాయం, గ్రామీణ పరిశ్రమలు, వైద్యం, పారిశుధ్యం, సహకార సంస్థలు, స్వల్ప నీటివనర్లు పశుసంరక్షణ మున్నగు అంశాలను స్థానిక పరిస్థితులను దృష్టిలో వుంచుకొని చర్చించారు. స్త్రీలు కూడా శిబిర నిర్వహణపట్ల శ్రద్ధాసక్తులు కన్పరచి స్త్రీల సమస్యలు, శిశు సంక్షేమం మొదలగు చర్చల్లో పాల్గొన్నారు.

చర్ఖా, తేనె పట్టులు మొదలగు కుటీర పరిశ్రమల అభివృద్ధి విషయంలో గ్రామస్తులు ఆసక్తి చూపారు. కోళ్ళ పక్షుల పెంపకంకూడా వారిని ఆకర్షించింది. యువకులు కూడా శిబిరాల్లోకి వచ్చి చర్చల సరళిని గ్రహించారు. యువజన క్లబ్బులు స్థాపించడానికి వారు సంసిద్ధత చూపారు. వెనుకటి మాదిరిగా ఎప్పుడూ ప్రభుత్వంపై ఆధారపడకుండా స్వయంగా చొరవ తీసుకొని ఉమ్మడిగా కృషి చేసినట్లయితే తమ సమస్యలెన్నో సులభంగా త్వరగా పరిష్కారం కాగలవని గ్రూపు చర్చలవల్ల వారు గ్రహించగలిగారు. నీటిపారుదల, పశువైద్యం మొదలగు విషయాలలో అధికార నిపుణులు సలహాలిచ్చి తోడ్పడినట్లయితే తమ సమస్యలను తామే పరిష్కరించుకోగలమని భావించారు.

ఈ శిబిరాల నిర్వహణలో ప్రత్యేకంగా చెప్పదగిన మరొక విశేష మేమిటంటే శిబిరాలకు తగు ఏర్పాట్లు చేయడానికీ, చర్చలు జరిపించడానికీ గ్రామస్తులే పూనుకొన్నారు. సమస్యలు తమవే కాబట్టి వాటికి పరిష్కారాలను కూడా తామే కనుగొనగలమన్న గ్రహింపు వారిలో కన్పించింది. ఈ శిబిరాలవల్ల అధికార్లు కూడా గ్రామస్థులతో నేరుగా వ్యవహరించి, వారి తక్షణ సమస్యల్ని తెలుసుకొనే వీలు కలిగింది. "పునాది నుంచి పైకి పోవడం" అంటే ఇదేకదా. జీవితాన్ని సమష్టి దృష్టితో చూచి సమష్టి సంక్షేమం కోసం పరస్పర సహకారభావంతో మెలగవలెననే భావన గ్రామస్థులలో కలిగింది. అధికారులూ ప్రజలూ కలిసి చర్చలు జరుపడంచేత సమస్యల్ని సరియైన దృక్పథంతో చూడడానికి అవకాశం కలిగింది. ప్రతి గ్రూపు చర్చకు సగటున 50 మందికిపైగా హాజరయ్యారు. గ్రామస్తులలో మార్పు తేవడానికీ, స్థానిక సమస్యల ప్రాముఖ్యాన్ని జాతీయ శ్రేయస్సౌభాగ్యాల దృష్టితో చూచి ఆత్మ విశ్వాసం పెంపొందించడానికి ఇటువంటి శిబిరాలు ఎంతో ఉపకరిస్తాయి.

### ములుగు బ్లాకులో

తెలంగాణా ప్రాంతంలోని ములుగుబ్లాకు (అనంతర కృషి కేంద్రం) లో 1957 ఫిబ్రవరినెలలో జరిగిన కృషి వివరాలు :

420 మణుగుల రసాయనిక ఎరువులు సప్లయి చెయ్యబడ్డవి.

19 కంపోస్టు ఎరువుగుంటలు త్రవ్వబడ్డవి.

19 మేలుజాతి గిత్తలకు విత్తులు కొట్టబడ్డవి.

45 మంది వ్యక్తులు సహకార సంఘాల సభ్యులుగా చేర్చుకోబడ్డారు.

## పశ్చిమగోదావరి జిల్లాలో జాతీయ విస్తరణ కేంద్రాలు

పశ్చిమ గోదావరిజిల్లాను 25 జాతీయ విస్తరణ సేవాకేంద్రాలు (యన్. ఇ. యస్. బ్లాకులు) గా విభజించవలెనన్న ప్రతిపాదన ఆమోదించబడింది. ప్రస్తుతమున్నట్టి చింతలపూడి, కొయ్యలగూడెం సామాజికాభివృద్ధి బ్లాకులను వరుసవారీగా రెండు మూడు బ్లాకులుగా పునర్నిర్మించడమయినది. ఈ పునర్నిర్మాణం అనంతరకృషి దశలో అమలులోకి వస్తుంది

25 యన్. ఇ యస్. బ్లాకులు ఇవి: 1. భీమడోలు, 2. దెందులూరు 3. పెదపాడు 4. మలకపల్లి 5. నిడదవోలు 6. గోపాలపురం 7. వీరవాసరం. 8. ఉండి 9. ఆకివీడు 10. పెంటపాడు 11. గణపవరం 12. నల్లజెర్ల 13. తెప్పలి 14. పేరవల్లి 15. పెనుగొండ 16. అత్తిలి 17. పాలకొల్లు 18. మొగల్తుర్రు 19. ఆచంట 20. రుస్తుంబాద 21. కామవరపుకోట 22. చింతలపూడి. 23. పోలవరం 15. బుట్టాయగూడెం 25, కొయ్యలగూడెం.



శిక్షణపొందుచున్న బ్లాకు డెవలప్‌మెంటు ఆఫీసర్లు షాద్‌నగరు గ్రామస్థులతో పరిశ్రమలను గూర్చి చర్చిస్తున్నారు.



మన గ్రామీణ పరిశ్రమలు—

# చేనేతపరిశ్రమ : కొన్ని విశేషాలు

—○—

నాల్గవ అఖిల భారత చేనేత వారోత్సవాలు 1957 మే నెల 5 వ తేదీనుంచి 12 వ తేదీవరకు భారత దేశమంతటా విజయవంతంగా జరుపబడ్డవి.

ఆంధ్రప్రదేశ్ లో 4 లక్షల 50 వేల చేనేత మగ్గాలున్నవి. దాదాపు 22 లక్షల మంది ప్రజలు జీవనోపాధి కొరకు ఈ వృత్తిపై ఆధారపడి వున్నారు. మనదేశంలో తయారయిన చేనేత వస్త్రాలకు మధ్య ప్రాచ్యం, ఆఫ్రికా, వియత్నాం, ఇండోనేషియా దేశాలలో మంచి గిరాకీ వున్నట్లు మార్కెట్ రిపోర్టులవల్ల తెలుస్తున్నది.

ఒకానొక నమూనా పరిశీలననుబట్టి భారతదేశమంతటా చేనేత పనివారల ఆదాయం 15 శతి నుంచి 30 శతి వరకు పెరిగినట్లు తెలుస్తున్నది.

1954 లో అఖిలభారత చేనేతబోర్డు ఏర్పాటు చేయబడింది. ఈ బోర్డువారు కొత్త డిజైనులను గూర్చి, వనమూలికలతో తయారుచేయబడు అద్దకపు రంగులను గూర్చి పరిశోధన జరుపడానికి తగు ప్రోత్సాహ మిస్తున్నారు.

అఖిలభారత చేనేతబోర్డువారు చేనేతపరిశ్రమాభివృద్ధికి రెండవ పంచవర్ష ప్రణాళికలో రూ. 130 కోట్ల ఖర్చు తలపెట్టారు. ఈ మొత్తంలోనుంచి రూ. 42 కోట్లు చేనేత సరుకు ఉత్పత్తికీ, విక్రయానికీ పనిచేసే సహకార సంఘాల చెలామణీ మూలధనం నిమిత్తం వినియోగింపబడుతుంది. చేనేత పనివారల సహకార సంఘాలకొరకై ప్రత్యేకంగా ఒక పెట్టుబడి వ్యవస్థను ఏర్పాటు చేయవలెనని



చేమగ్గాలు పనిచేయు విధానాన్ని ముఖ్యమంత్రి శ్రద్ధగా పరిశీలిస్తున్నారు.



చేనేతవారోత్సవాల సందర్భంలో రాష్ట్ర శాసనసభ డిప్యూటీస్పీకర్ శ్రీ కొండా లక్ష్మణ్ ఉపన్యసిస్తున్న దృశ్యం

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం నిర్ణయించింది. అంతేగాక అట్టి వ్యవస్థ ఏరూపంలో వుండవలెనో తగుప్రతిపాదనలు చేయడానికై ప్రభుత్వం ఒక ప్రత్యేకాధికారిని కూడా నియమించింది.

ఆంధ్ర ప్రదేశ్ చేనేత సరుకులలో ఈ దిగువ పేర్కొనబడినవి మిక్కిలి ప్రశస్తమైనవి.

1. గద్వాల, వెంకటగిరి, సిద్దిపేట, ఉప్పాడ, పోచంపల్లి, నారాయణపురం చీరెలు.
2. సిద్దిపేట, జనగాము, కోస్గి రవికెకణుములు.
3. కరీంనగర్, సికింద్రాబాదు బెడ్‌షీట్లు.
4. మహబూబ్ నగర్ కంబళ్ళు
5. హైద్రాబాదు హిమ్రూ.

[తరువాయి చివరిపేజీలో]



నాల్గవ అఖిలభారత చేనేత వారోత్సవాలలో పాల్గొన్న ప్రేక్షకుల దృశ్యం.

# వార్తలు - విశేషాలు

## కార్మిక సంక్షేమ కేంద్రాలు

ఆంధ్రప్రదేశ్‌లో ఇటీవల కార్మిక సంక్షేమ కార్యకలాపాలు విస్తృతంగా ' అమలు జరుగుతున్నవి. రెండవ పంచవర్ష ప్రణాళిక క్రింద కార్మికులకు ఇతోధికంగా సౌకర్యాలు కల్పించే ఉద్దేశంతో రాష్ట్రంలో ముఖ్యమైన పారిశ్రామిక కేంద్రాలన్నిటిలో సంక్షేమ కేంద్రాలను నెలకొల్పవలెనని తలపెట్టబడింది. ఆ కేంద్రాలలో కార్మికులకు, వారి భార్యా పిల్లలకు విద్యా, వినోదసౌకర్యాలు వుండడమేగాక ఇతర వైజ్ఞానిక కాలక్షేపాలకు కూడా వీలుంటుంది. మొదట తెలంగాణా ప్రాంతంలో 4 'ఏ' షైపు, 11 "బి" షైపు కేంద్రాలు, ఆంధ్ర ప్రాంతంలో ఒక కేంద్రమూ పిల్లల విభాగం ఒకటి, నర్సరీ, బాలబాలికల స్త్రీల క్లబ్బులు వుంటాయి. గృహ క్రీడలకూ మైదాన క్రీడలకు కూడా ఏర్పాట్లు వుంటాయి. 1957-58 సంవత్సరంలో హైద్రాబాదు, వరంగలు, నిజామాబాదు, సిర్పూరు, ఖమ్మం, సికింద్రాబాదు, మంచిర్యాల, విజయవాడలలో ఈ కేంద్రాలను స్థాపించవలెనని తలపెట్టబడింది.

## క్రొత్త దశాంశనాణెములు

కొన్ని దశాంశనాణెములకు వెనుకవైపున సంవత్సరం ముద్రక్రింద ఒక చుక్క వున్నది. మరి కొన్నిటికి లేదు. ఈ రెండురకాల నాణెములలో ఒకటి కృత్రిమమైనదని ప్రజలలో కొందరు అనుకుంటున్నారు. బొంబాయిలో ఏనాణెం తయారైంది. కలకత్తాలో ఏది తయారయింది అన్నదానిని కనుగొనుటకై పురాతన కాలంనుండి ఒక పద్ధతి అవలంబింపబడుతున్నది. అదేమిటంటే బొంబాయి టంకశాలలో తయారయిన నాణెములకు చుక్క ఉంటుంది. కలకత్తా నాణెములకు చుక్కవుండదు. దశాంశనాణెముల పద్ధతి అమలులోకి రాని పూర్వం కూడా యీ పద్ధతి వుండేది. దశాంశనాణెముల డిజైను ఆమోదింపబడిన సందర్భంలో ఆ నాణెములపై చుక్క వుందా లేదా అన్న విషయం ప్రస్తావనకు రాలేదు. చుక్క ఉన్నవీ, లేనివీకూడా ఆమోదింపబడిన డిజైనుకు చెందిన నాణెములే. ఈ రెండురకాల నాణెములుకూడా చెల్లుతవి.

## ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ స్కాలర్‌షిప్పులు

భారతదేశంలో జన్మించి విదేశాలలో నివసిస్తున్న తెలుగు వారిలో తెలుగుభాషా, సంస్కృతులను పెంపొందించే ఉద్దేశంతో, కేంద్ర ప్రభుత్వంతో సంప్రదించిన అనంతరం అక్కడి తెలుగువిద్యార్థులకు ఏటేటా మూడు స్కాలర్‌షిప్‌లు మంజూరు చేయటానికి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం నిశ్చయించింది. ఈ క్రింది షరతులు, నిబంధనలు యీ స్కాలర్‌షిప్‌లకు వర్తించగలవు.

1. విద్యార్థులు, బర్మా, మారిషస్, ఫిజీ, దక్షిణాఫ్రికా, మలయాలలో ఏదైనా ఒక దేశంలో స్థిరనివాస మేర్పరచుకున్నవారై వుండాలి.

2. భారత విశ్వవిద్యాలయాలలోని బి. ఎ. డిగ్రీకి సమానమైన డిగ్రీని కానీ, డిప్లొమా కాని విద్యార్థులు గడించి ఉండాలి.

3. బి. ఎ. అనంతర తరగతులలో వారు తెలుగు - సంస్కృతం, భారతదేశ చరిత్ర భారతీయ తత్వశాస్త్రములలో విద్యాభ్యాసం చేయాలి.

4. మామూలు కోర్సుకాకుండా విద్యార్థులు పై విషయాలలో అదనంగా ట్యూషను చెప్పించుకోవాలి.

5. స్కాలర్‌షిప్ మామూలుగా రెండేండ్లపాటు ఉంటుంది. కాని విద్యాభ్యాసం పూర్తియగుటకు తగినట్లుగా మరొక సంవత్సరం పొడిగింపబడవచ్చు.

6. ఇండియా ప్రభుత్వపు సాంస్కృతిక స్కాలర్‌షిప్‌లవలె, యీ స్కాలర్‌షిప్‌ల మొత్తం కూడా నెలకు రు. 200 లు వుంటుంది. ఈ మొత్తం కాక, ట్యూషన్‌ఫీజు, యూనివర్సిటీ ఫీజు సంవత్సరపు పన్నులు వగైరా ఏమైనా వుంటే వాటినికూడా ప్రభుత్వమే చెల్లిస్తుంది.

7. అర్హమైన సందర్భాలలో విద్యార్థి భారత దేశానికి రాకపోకల ఖర్చులు భరించలేని యెడల సముద్రంపై ప్రయాణానికి రెండవ తరగతి చార్జీలు చెల్లింపబడుతవి. రెండవ తరగతి సౌకర్యం లేని ఓడలలో అయితే టూరిస్ట్ తరగతి చార్జీలు చెల్లించటం జరుగుతుంది.

ఈ స్కాలర్‌షిపుల కొరకై పైన తెలుపబడిన దేశాలల్లో నివసిస్తున్న అభ్యర్థులు దరఖాస్తు పెట్టుకోవలసిందిగా అక్కడి భారతదేశ దౌత్య కార్యాలయాలు ప్రకటనచేసి, వచ్చిన దరఖాస్తులను తమ సిఫారసులతోపాటు భారత ప్రభుత్వానికి పంపగలవు. వాటిని భారత ప్రభుత్వంవారు తుది నిర్ణయం కొరకై రాష్ట్రప్రభుత్వానికి పంపిస్తారు.

## విద్యార్థివేతనాలు

పబ్లిక్ పాఠశాలల్లో చదివే బాలబాలికలలో అర్హులయినవారికి కేంద్రప్రభుత్వం యోగ్యతా స్కాలర్‌షిప్పులను ఇస్తుంది. ఇందుకు అట్టి పిల్లల వయస్సు 1957 జూలై 15 నాటికి 5 సంవత్సరాలు నిండి వుండాలి, కాని 12 సంవత్సరాలు దాటి వుండకూడదు.

మొత్తం విద్యార్థి వేతనాలలో $17\frac{1}{2}$ శాతం షెడ్యూల్డు కులాలు, షెడ్యూల్డుజాతులు, ఇతర వెనుకబడిన తరగతులకు కేటాయించబడతాయి.

దరఖాస్తులను నిర్ణీత ఫారాలలో రెండు ప్రతులుగా సమర్పించాలి. ఈ ఫారాలను ఆంధ్ర ప్రదేశ్ విద్యాశాఖ డైరెక్టరు, చాపల్‌రోడ్, హైదరాబాదు నుంచికాని లేక కర్నూలులోని విద్యాశాఖ డైరెక్టరు బ్రాంచి కార్యాలయంనుంచికాని పొందవచ్చును. పై రెండు కార్యాలయాల్లోనూకూడా దరఖాస్తులు తీసుకునే ఆఖరుతేదీ 1-7-1957.

ఒక్కొక్క దరఖాస్తుతో ఒక రూపాయ విలువగల పోస్టల్ ఆర్డర్ జతచేసి పంపాలి. అది క్రాస్ చేయబడి, కేంద్రప్రభుత్వపు కార్యదర్శి, విద్యా మంత్రిత్వశాఖ, న్యూఢిల్లీ పేర ఎండార్సు చేయబడాలి.

## అరటి పరిశోధన కేంద్రం

ఆంధ్రప్రదేశ్‌లో మూడేండ్లపాటు మొత్తం రూ. 78,037 ఖర్చుతో అరటిపండ్ల పరిశోధన కేంద్రమును స్థాపించుటకై తలపెట్టబడిన పథకమునకు ప్రభుత్వం ఆమోదం తెలిపింది. ఈ ఖర్చును రాష్ట్ర ప్రభుత్వమూ, భారత వ్యవసాయ పరిశోధన సంఘంవారు ఉభయులూ భరిస్తారు.

## ఉల్లిగడ్డల పరిశోధనకేంద్రం

రూ. 92,820 ల ఖర్చుకు మించకుండా అయిదేండ్లపాటు ఉల్లిగడ్డల పరిశోధనాకేంద్రము నొకదానిని నెలకొల్పుటకై ప్రభుత్వం ఒక పథకానికి మంజూరీ ఇచ్చింది. ఈ పథకం కడపజిల్లాలో గంగరాజపురం గ్రామంవద్దగల ప్రభుత్వ బంజరు భూమిలో అమలు జరుపబడుతుంది. దీని ఖర్చును భారతీయ వ్యవసాయ పరిశోధనా కేంద్రమూ, రాష్ట్రప్రభుత్వమూ భరిస్తాయి. రాష్ట్రప్రభుత్వం వాటా రూ. 64,060. ఈపథకంపై వచ్చే ఆదాయాన్ని రాష్ట్రప్రభుత్వమూ, వ్యవసాయ పరిశోధన సంస్థ చెరిసగం పంచుకుంటాయి.



# * డైరీ *

## ఏప్రిల్, 1957

24. ఆంధ్రప్రదేశ్‌లో ప్రతిజిల్లాలో ఒకగ్రామంలో పోలీసులు స్థానిక అభివృద్ధి కార్యకలాపాలలో పాల్గొంటారు. తెలంగాణా జిల్లాలలో ఈ విషయంలో పోలీసులు అనుసరించిన ప్రయోగవద్ధతి చాలా విజయవంతమైనదని పోలీసు ఇన్‌స్పెక్టరు జనరల్ పత్రికా విలేఖరులకు తెలియజేశారు.

25. రెండవ పంచవర్ష ప్రణాళిక కాలంలో రాష్ట్రంలో రూ. 103 లక్షల మేరకు మురికి పేటల నిర్మూలనా పథకాలకు ద్రవ్యసహాయం చేయుటకు భారత ప్రభుత్వం అంగీకరించినట్లుగా ప్రకటింపబడింది.

రూ. 6 లక్షల ఖర్చు అంచనాతో నాగార్జునసాగర్ కుడికాలువలో 14 వ మైలునుంచి 15 వ మైలు వరకు, అంటే ఒక మైలు పొడవున కాలువ నిర్మాణాన్ని భారత్ సేవక్ సమాజ్‌వారికి అప్పగించడానికి రాష్ట్రప్రభుత్వం అంగీకరించింది.

26. ఇంతవరకూ వసూలుకాకుండావున్న దాదాపు రూ. 10 కోట్ల భూమిశిస్తు, అబ్కారీ బకాయీలను చురుకుగా పనిచేయించి వసూలు చేయడానికి రాష్ట్రప్రభుత్వం నిర్ణయించిందని ప్రకటింపబడింది.

27. రాష్ట్రప్రభుత్వ సర్వీసులోనున్న ఉద్యోగులకు సర్వసాధారణ సర్వీసు నియమావళిని రూపొందించడానికై రాష్ట్రప్రభుత్వం ఒక ప్రత్యేకోద్యోగిని నియమించింది.

రెండవ పంచవర్ష ప్రణాళిక కాలంలో రాష్ట్రంలోని అనేక సాంకేతిక సంస్థలను విస్తృతీకరించడానికై చేయబడిన ప్రతిపాదనలను అఖిలభారత సాంకేతిక విద్యాసంఘం ఆమోదించింది.

28. రాష్ట్ర భూమ్యాదాయశాఖ మంత్రి నెల్లూరులో ఒక ఇంటర్వ్యూలో తాముతలపెట్టిన భూసంస్కరణల శాసనంలో భూములపై గరిష్ఠపరిమితి నిర్ణయం కూడా చేరివుంటుందని తెలిపారు. ఈ విషయంలో మరెట్టి కమిటీలు నియమింపబడవనికూడా వారు తెలిపారు.

రాష్ట్రంలో సాంకేతిక విద్యాభివృద్ధిని సమన్వయపరచడానికై రాష్ట్రప్రభుత్వం రాష్ట్ర సాంకేతిక విద్య మరియు శిక్షణ బోర్డును ఏర్పాటుచేసింది.

29. 1956-57 సంవత్సరంలో ఆంధ్రప్రాంతంలో పని ప్రారంభింపబడిన 11 సామూజికాభివృద్ధి బ్లాకులలో (మొదటి వరుసవి) చాలా ప్రగతి సాధింపబడినట్లు, నిర్ణయింపబడిన లక్ష్యాలను అధిగమించడం కూడా జరిగినట్లు తెలియవస్తున్నది. ఇందుకు ప్రజల సంపూర్ణ సహకారమే కారణమని కూడా తెలియవచ్చింది.

30. విదేశాలలో నివసిస్తున్న తెలుగువారిలో తెలుగు భాషా సంస్కృతులను పెంపొందింపజేసే ఉద్దేశంతో ప్రతి సంవత్సరం స్కాలర్‌షిప్‌లను ఇవ్వడానికి రాష్ట్రప్రభుత్వం నిర్ణయించింది.

## మే, 1957

1. పాఠశాలలకు పాఠ్యపుస్తకముల ప్రచురణ బాధ్యతను స్వీకరించే సమస్యను విద్యాశాఖ పరిశీలిస్తున్నదని రాష్ట్రవిద్యామంత్రి తెలియజేశారు. ఈ పథకం రెండుమూడు నెలల్లో రూపొందించబడవచ్చు.

2. రాష్ట్రంలో మత్స్య సంపదకు దోహదం కలుగజేసే ఉద్దేశంతో రెండవ పంచవర్ష ప్రణాళిక కాలంలో చేపలు పట్టువారి పడవల ఇంజనులను సరఫరా చేయడానికి ప్రభుత్వం నిర్ణయించింది.

3. ఆంధ్రప్రదేశ్ సాధారణ అమ్మకపు పన్ను బిల్లును పరిశీలించడానికై రాష్ట్రశాసన సభచే నియమింపబడిన సెలక్టు కమిటీవారు జొన్నలకు రూపాయకు రెండు నయాపైసల చొప్పున ఏకముఖ పన్నును విధించవలెనని నిర్ణయించారు.

4. దక్షిణప్రాంతీయ మండలిలో ఆంధ్రప్రదేశ్ ప్రతినిధులుగా రాష్ట్ర ముఖ్యమంత్రిని, హోంమంత్రి శ్రీ కె. వి. రంగారెడ్డిని, రెవెన్యూమంత్రి శ్రీ కళా వెంకటరావును గవర్నర్ నామినేట్ చేశారు.

విస్తృతమైన రాష్ట్ర శాసనసభలో వ్యవహారముల నిర్వహణలో తెలుగుకు సముచితస్థాన మివ్వడానికై ఆచరణ సాధనమైన చర్యలను సిఫార్సు చేయడానికై శాసనసభ స్పీకర్ 22 మంది సభ్యులతో ఒక అడ్‌హాక్ కమిటీని నియమించారు.

5. ఆంధ్రప్రదేశ్ ప్రథమ సహకార మహాసభ విజయనగరంలో జరిగింది.

రెండవ పంచవర్షప్రణాళిక కాలంలో రూ. 26 లక్షల ఖర్చుతో సహకార శిక్షణ సౌకర్యాలను విస్తృతం చేయడానికి ప్రభుత్వం నిశ్చయించినట్లుగా ప్రకటింపబడింది.

6. రాష్ట్రంలోని బోర్డుజిల్లాలను 1957 డిసెంబరుకుముందే పునర్నిర్మాణం చేయడానికి ప్రభుత్వం సంకల్పించిందని రాష్ట్ర శాసనసభలో స్థానిక స్వపరిపాలనా మంత్రి తెలియచేశారు.

ఆంధ్రప్రదేశ్‌లో అమ్మకపు పన్ను విధించడానికి వుండవలసిన కనీస వ్యాపారపరిమితిని రూ. 7,500 ల నుంచి రూ. 10,000 లకు హెచ్చించడమైనది. ప్రతి సంవత్సరం రూ. 7,500 లకు తక్కువగాని వ్యాపారం వున్నట్టి వర్తకులకు రిజిస్ట్రేషన్ ఫీజు రూ. 3 ల నుంచి రూ. 6 లకు హెచ్చింపబడింది.

7. సాధ్యమైనంతత్వరలో రాష్ట్రంలోని ఎయిడెడ్ ఎలిమెంటరీ స్కూళ్ళ యాజమాన్యాన్ని స్వీకరించడానికి ప్రభుత్వం తలపెట్టిందని శాసనసభలో రాష్ట్ర విద్యామంత్రి తెలియజేశారు.

8. ఐదురోజులు విపులంగా చర్చించిన మీదట రాష్ట్ర శాసనసభ సాధారణ అమ్మకపు పన్ను బిల్లును ఆమోదించింది.

9. ప్రస్తుత ఆర్థిక సంవత్సరాంతానికి లోపుగానే సమగ్రమైన భూసంస్కరణలను తలపెట్టడం రాష్ట్ర ప్రభుత్వానికి సాధ్యంకాదనీ, అందుకు కారణం ఆర్థిక చిక్కులేననీ రాష్ట్ర ముఖ్యమంత్రి పత్రికా విలేఖరులతో అన్నారు.

10. ప్రస్తుత ఆర్థికసంవత్సరంలో (1957-58 లో) రెండవ పంచవర్షప్రణాళికలో లేనట్టి స్థానిక అభివృద్ధి పనులను అమలుజరుపడానికై కేంద్రప్రభుత్వం రాష్ట్ర ప్రభుత్వానికి రూ. 38 లక్షల అప్పును మంజూరుచేయడానికి అంగీకరించినట్లుగా ప్రకటించబడింది.

11. స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియా అధ్వర్యాన స్వల్పపరిశ్రమల సహాయానికై తలపెట్టబడిన పైలట్ స్కీము హైదరాబాదు నగరానికి కూడా విస్తరింపజేయబడింది.

12. మహబూబ్‌నగర్ రైలు ప్రమాదం విచారణ సంఘంవారు వెలిబుచ్చిన అభిప్రాయాలతో భారత ప్రభుత్వం ఏకీభవించలేదు. ఆ ప్రమాదానికి రైల్వే పరిపాలన గాని సీనియర్ ఇంజనీరింగ్ అధికారులు గాని బాధ్యులు కాదని భారతప్రభుత్వ అభిప్రాయం.

13. రాష్ట్రంలో నిరుద్యోగ సమస్యను పరిష్కరించడానికై మంత్రులు, అధికారులతోకూడిన ఉన్నత స్థాయి సమావేశం జరిగింది. ఈ సమస్యను పరిశీలించి నివేదికను దాఖలు చేయడానికై ప్రభుత్వం ముగ్గురు సభ్యులతో ఒక కమిటీని నియమించింది.

14. త్వరితగతిని సామాజికాభివృద్ధి పనిని జరిపించడానికై రెండవ పంచవర్ష ప్రణాళిక కాలం ముగిసే లోపుగా మొత్తం రాష్ట్రాన్ని 445 బ్లాకులుగా విభజించడమవుతుందని రాష్ట్ర ప్లానింగ్ మంత్రి తెలియజేశారు.

ఆంధ్ర ప్రాంతంలోని జిల్లా కలెక్టర్లు వారివారి ప్రాంతాలలో జమాబందీని వాయిదావేసే విషయంలో తమవిచక్షణాధికారాన్ని వినియోగించడానికి ప్రభుత్వం అనుమతించింది. కొన్ని జమాబందీ కేంద్రాలలో గ్రామోద్యోగులు జీతాల పెంపకం మొదలైన తమ కోర్కెలను నెరవేర్చేటంతవరకు తాము జమాబందీ పనిలో పాల్గొనమని బెదిరించిన కారణంగా పై విధంగా ప్రభుత్వం అనుమతించవలసి వచ్చింది.

15. వచ్చే విద్యాసంవత్సరం నుంచి బాపట్లలోని ప్రభుత్వ వ్యవసాయ కళాశాలలో సీట్ల సంఖ్యను రెట్టింపు చేయుటకు ప్రభుత్వం తలపెట్టిందని ప్రకటింపబడింది.

హైద్రాబాదు, సికింద్రాబాదు నగరాలలోని కేంద్ర ప్రభుత్వోద్యోగులు ఈ ఉభయనగరాలను 'ఏ' క్లాసు నగరాలుగా ప్రకటించవలెనని కోరారు.

16. ఆంధ్ర ప్రభుత్వం బుడమేరు రిజర్వాయరు పథకాన్ని వదులుకుందని రాజ్యసభలో యూనియన్ ప్రభుత్వ నీటి పారుదల విద్యుచ్ఛక్తి శాఖామంత్రి శ్రీ కె. సూర్యనారాయణకు తెలియజేశారు.

రాష్ట్ర ముఖ్యమంత్రి సామాజికాభివృద్ధి విద్వద్గోష్ఠిని ప్రారంభించారు.

17. వచ్చే విద్యా సంవత్సరంలో సాంకేతికవృత్తి విద్యా కళాశాలలతో సహా అన్ని కళాశాలలకూ అభ్యర్థుల ఎన్నిక ప్రాంతీయ, జనాభా ప్రాతిపదికపై జరుగగలదనీ, ప్రతి ప్రాంతానికి న్యాయం జరుగుతుందనీ రాష్ట్ర విద్యామంత్రి తెలిపారు.

18. సామాజికాభివృద్ధి విద్వద్గోష్ఠిముగింపు సమావేశంలో యూనియన్ ప్రభుత్వ సామాజికాభివృద్ధి మంత్రి ప్రసంగిస్తూ సామాజికాభివృద్ధి విషయంలో ఆంధ్రప్రదేశ్ ఇతర రాష్ట్రాలకు ఆదర్శప్రాయంగా వుందనడంలో ఏమాత్రం సందేహం లేదన్నారు. గత రెండుసంవత్సరాలలో ఈ రాష్ట్రం సాధించిన ఫలితాలు అద్భుతంగా వున్నవని అన్నారు.

19. యూనియన్ ప్రభుత్వ రక్షణ శాఖ కార్యదర్శిగానియమింపబడిన శ్రీ ఓ. పుల్లారెడ్డి ఐ.సి.యస్. స్థానే శ్రీ యం.పి. పాయ్ ఐ.సి యస్. రాష్ట్రప్రభుత్వ ప్రధాన కార్యదర్శిగా నియమింపబడినట్లు అధికార ప్రకటన వెలువడింది.

20. ఆంధ్ర కేసరి ప్రకాశంపంతులుగారు హైదరాబాదులో కాలధర్మం చెందారు.

21. సకల రాజమర్యాదలతో ప్రకాశంపంతులుగారి అంత్యక్రియలు జరిగినవి. వేలాది మంది ప్రజలు శ్రద్ధాంజలి సమర్పించారు.

ఆంధ్రకేసరి మృతి పట్ల పార్లమెంటు ఉభయ సభలలోను సంతాపం ప్రకటించబడింది.

22. రూ. 75000-0-0 ల ఖర్చుతో అంతర్వేది వద్ద లైట్‌హౌజ్‌ను నిర్మించడానికై లైట్‌హౌజెస్ డైరెక్టరు తగు స్థలాన్ని ఎన్నిక చేసినట్లు వార్త ప్రకటితమైంది.

యూనియన్ పబ్లిక్ సర్వీసు కమీషనువారు వెలువరిచిన పత్రికా ప్రకటననుబట్టి (1957) సెప్టెంబరు - అక్టోబరులో జరుగు ఐ. ఏ. యస్. తదితర పరీక్షలకు హైద్రాబాదు కూడా ఒక కేంద్రంగా వుండగలదు.

23. హోస్పేటవద్ద తుంగభద్ర డాము పవర్ హౌస్‌లో 9,000 కిలోవాట్ల శక్తిగల రెండవ జనరేటింగ్‌సెట్టు పనిచేయడమారంభమైనట్లుగా ప్రకటింపబడింది, దీనితో డాము పవర్ హౌస్‌లో రెండు జెనరేటింగ్ సెట్లను స్థాపించవలెనన్న కార్యక్రమం పూర్తి అయింది.

24. ఆమోదింపబడి రిజిష్టరైన సభలు తదితర సంస్థలు వేయు నాటక ప్రదర్శనాలకు 1957 ఏప్రిల్ 1 వ తేదీనుంచి మరొక సంవత్సరం వరకు వినోదపు పన్ను మినహాయింపును పొడిగిస్తూ ప్రభుత్వం ఉత్తర్వు చేసింది.

25. దేశంలో రెండవ నౌకానిర్మాణ కేంద్రాన్ని నెల్లూరుజిల్లాలోని కృష్ణాపట్నం మైనర్ రేవులో నెలకొల్ప వలసిందని రాష్ట్రప్రభుత్వం కేంద్రప్రభుత్వానికి సూచించింది.

రాష్ట్రప్రభుత్వాలు కుటుంబనియంత్రణ అధికార్లను నియమించవలెననీ, కుటుంబనియంత్రణ బోర్డులను ఏర్పాటు చేయవలెననీ భారతప్రభుత్వ ఆరోగ్యమంత్రి అన్నారు. కేంద్రకుటుంబ నియంత్రణ బోర్డు రెండవ సమావేశంలో ప్రసంగిస్తూ కుటుంబ నియంత్రణ కేంద్రాల స్థాపనకు హెచ్చు ప్రాధాన్య మివ్వాలని ఆయన అన్నారు.

26. ప్రజలకు సౌకర్యంగావుండడానికీ, చట్టమును అమలుపరిచేవారి పనిని సుకరం చేయడానికీ రాష్ట్రంలోని భూసంబంధమైన శాసనాలను క్రోడీకరించడానికి ప్రభుత్వం తలపెట్టింది.

కలకత్తా పోర్టు ట్రస్టుకు మూరింగ్ వెసల్‌పై వుండే మోటారు కార్గోవెసల్సు యొక్క నిర్మాణం విశాఖపట్నంలోని హిందూస్తాన్ నౌకానిర్మాణశాల బెర్తులలో జరుగుతున్నట్లు ప్రకటింపబడింది.

27. భూసంస్కరణలకు సంబంధించిన శాసనం ముసాయిదా జులై మాసాంతం వరకు సిద్ధం కాగలదని రాష్ట్ర భూమ్యాదాయ మంత్రి హామీ ఇచ్చారు.

28. భద్రాచలంవద్ద ఏప్రిల్ 10 వ తేదీన జరిగిన గోదావరి పడవ ప్రమాదాన్ని విచారించడానికై ఐదుగురు సభ్యులతో నియమింపబడిన విచారణ సంఘం తన నివేదికను పూర్తిచేసిందనీ ఆ నివేదిక దాదాపు 40 పేజీ లుంటుందనీ తెలియవస్తున్నది.

రాష్ట్రంలోని సామాజికాభివృద్ధి కేంద్రాలలో జాతీయ వికాస కేంద్రాలలో 109 ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలను తెరువడానికై ఐక్యరాజ్య సమితి తాలూకు శిశుసహాయకసంస్థ రూ. 17 లక్షల వరకు ఆర్థిక సహాయం చేయగలదని ప్రకటింపబడింది.

29. రాష్ట్రంలో గ్రామీణ విశ్వవిద్యాలయాన్ని నెలకొల్పే విషయంలో తగు పరిశీలన జరిపి నివేదిక దాఖలు చేయుటకై డా॥ బి. రామచంద్రారెడ్డిగారి అధ్యక్షతన ప్రభుత్వం ఒక సంఘాన్ని నియమించింది. ఈ సంఘంలో తొమ్మిదిమంది సభ్యులున్నారు.

30. గ్రామోద్యోగులు తమ జీతాలు పెరగవలెనంటే వంశపారంపర్యపు హక్కులను వదులుకోవాలి.

వంశపారంపర్యపు హక్కులూవుండాలి, జీతాలు పెరగాలంటే అది సాధ్యంకాదు. ఏదోఒకటి వారే తేల్చుకోవాలని రాష్ట్ర ముఖ్యమంత్రి అన్నారు.

31. ప్రస్తుత ఆర్థిక సంవత్సరంలో రాష్ట్రంలో అమ్మకపుపన్ను మూలంగా రూ 10 కోట్ల ఆదాయం రాగలదని తాము ఆశించుతున్నట్లుగా రాష్ట్ర ఆర్థిక మంత్రి తెలియజేశారు.

మాచ్ ఖండ్ జలవిద్యుచ్ఛక్తి నాగార్జునసాగర్ ప్రాజెక్టుకు విస్తరింప జేయబడింది.

* * * *

## ఆంధ్రప్రదేశ్‌లో ప్రజారోగ్య పథకాలు [ 40 వ పేజీ తరువాయి ]

మాత్రమే మిగిలింది. ఖమ్మం, వరంగలు, కరీంనగర్ జిల్లాలలో పునః పరిశీలన ఇదివరకే పూర్తిచేయబడింది.

యాస్ వ్యాధి నిరోధక ఉద్యమం ప్రారంభింపబడిన తరువాత ఈ వ్యాధి ఇప్పుడు చాలావరకు తగ్గి నూటికి ఒకరి కంటె తక్కువగానే ఇప్పుడు రోగులున్నారు. ప్రాథమిక పరిశీలనలో ఏజన్సీ ప్రాంతాలలోని జనాభాలో నూటికి 98 వంతుల మందికి చికిత్సచేయడం జరిగింది. జనాభాలో నూటికి 2 వంతుల మంది పరిశీలన జరిగే సమయం లేదు. కాని పునఃపరిశీలనలో వారు కూడా వచ్చేశారు.

31-3-1957 తేదీవరకు ఆంధ్రప్రదేశ్‌లో దాదాపు పది లక్షల మంది ప్రజలు పరీక్షింపబడ్డారు. జనాభాలో నూటికి 15 వంతులమందికి పెన్సిలిన్ ఇచ్చి చికిత్స చేయటమైంది.

## చేనేత పరిశ్రమ : కొన్ని విశేషాలు [ 53 వ పేజీ తరువాయి ]

6. ఆర్మూరు, సిద్దిపేట, దామనగిడ్డ పట్టు చీరెలు.

7. కమలాపురం, శాలిబండ, కరీంనగర్ షర్టింగులు, కోటింగులు,

8. వరంగలు, ఏలూరు తివాచీలు.

తెలంగాణాలోని చేనేత పనివారలలో నూటికి 90 వంతుల మంది, ఆంధ్రప్రాంతంలోని పనివారలలో నూటికి 32 వంతులమంది సహకార సంస్థలలో చేరివున్నారు.

ఆంధ్ర ప్రదేశ్ చేనేత వస్త్ర విక్రయశాలలు బొంబాయి, మద్రాసు, డిల్లీ నగరాలలో వున్నవి. కలకత్తాలోకూడా ఒక విక్రయశాలను పెట్టవలెనన్న ప్రతిపాదన వున్నది.

హైద్రాబాదులో 12 వేల కదుళ్ళతో ఒక సహకార నూలు మిల్లు, ఒక క్యాలెండరింగ్ బ్లీచింగ్ యంత్రశాల నెలకొల్పబడుతున్నవి.

త్వరలోనే పోచంపల్లి, జనగామ, కరీంనగర్, నారాయణపేట, తదితర చేనేత కేంద్రాలలో చేనేత పనివారల కాలనీలు ఏర్పాటుచేయబడగలవు.

## పుష్కర మాహాత్మ్యము [45 వ పేజీ తరువాయి]

సంపాదించుకుంటారు. పుష్కర కర్మలను క్రమం తప్పకుండా నిర్వర్తించడంవల్ల శారీరకంగా, మానసికంగా, ఆధ్యాత్మికంగా, మత సంబంధంగా, ఆముష్మికంగా సుఖసంపదలను పెంపొందించుకుంటారనీ అట్టివారు అసాధారణ ప్రతిభాసంపన్నులవుతారని భారతీయ శాస్త్రాలు నిరూపిస్తున్నాయి.



*1957 మే 29 తేదీన పద్మభూషణ శ్రీ మాడపాటి హనుమంతరావుగారు హైద్రాబాదు సమీపంలో ఈసా, మూసీనదుల సంగమస్థానంలో శ్రీ ప్రకాశంగారి అస్థికలను నిమజ్జనంచేస్తున్నారు.*



*రాజమండ్రివద్ద గోదావరినదిలో శ్రీ ప్రకాశంగారి అస్థికలు కలుపబడుతున్న దృశ్యం.*

